




The Andhra Patrika, Madras. } Regd. No M. 1118 Vol. 36 No 250 TUESDAY 13th DECEMBER 1949 వెల ఒకఅణా } Founder: K. NageswaraRao

# 'జాతీయ ఆర్థికరంగంలో నూత్న సంవత్సరంతో ఆందోళనస్థితి తగ్గిపోగలదు'

## అమెరికా భారతదేశాల స్నేహ సహకార ప్రాధాన్యం



### ఢిల్లీలో ఉభయరాజ్య ప్రతినిధుల సభ ప్రారంభం : డా॥ ముఖర్జీ అభిభాషణ

### సాన్నిహిత్యసాధనలో ప్రథమ అనధికార రాయబారిగా వెళ్లిన స్వామీ వివేకానంద సేవాప్రశంస

ఢిల్లీ, డిసెంబరు 12 : "ప్రపంచశాంతి అభ్యుదయాలకు అమెరికా భారత దేశముల మధ్య అతి సన్నిహితమైన సహకారం యేర్పడటం అత్యవసరం. సాంఘికంగానూ, సాంస్కృతికంగానూ, రాజకీయంగానూ, ఈ రెండు దేశాలమధ్యనూ ఎంత వైవిధ్యం కనుపించుతూ వుంటుందో అంత సాన్నిహిత్యంకూడా వుంది. అధునాతన భారత మహానాయకులు అనేకమంది ఈ రెండు దేశాల మధ్యనూ సాంస్కృతికంగా అవిచ్ఛిన్నమైన, దృఢమైన బాంధవ్యాన్ని నిర్మించారు. శ్రీ స్వామీ వివేకానందను అమెరికాకు వెళ్లిన భారత దేశపు ప్రథమ అనధికార రాయబారిగా చెప్పవచ్చును. గాంధీ, రవీంద్రకవిచంద్రులు భారతసంస్కృతిని అమెరికా ప్రజలకు మరింత సన్నిహితం చేశారు. ఇటీవలి ప్రధాని నెహ్రూ పర్యటనతో ఈ రెండు భూఖండాల మధ్యనూ మరింత అవినాభావమేర్పడటానికి సావకాశమేర్పడినది," అని భారత పారిశ్రామికమంత్రి డాక్టర్ శ్యామప్రసాద ముఖర్జీ ఈవేళ ఇక్కడ అమెరికా, భారత దేశాల స్నేహసంబంధాల సమావేశానికి ప్రారంభోత్సవం జరుపుతూ ఉద్ఘాటించారు.

ఈ వేళ ఇక్కడ జరిగిన ఇండో అమెరికన్ సమావేశానికి పారిశ్రామిక మంత్రి డాక్టర్ శ్యామ ప్రసాద్ ముఖర్జీ ప్రారంభోత్సవం చేశారు. ఈ సమావేశాన్ని, ఇండియా అంతర్జాతీయ వ్యవహార మండలి, అమెరికా పసిఫిక్ బాంధవ్య మండలుల సంయుక్తాధ్వర్యాన యేర్పాటు చేశారు.

'ప్రపంచ శాంతి అభ్యుదయాలకు అమెరికా భారత దేశాల మధ్య అత్యంత సన్నిహితమైన సహకారం యేర్పడటం అత్యవసరం. ఈ రెండు దేశాల మధ్యనూ ఎంత వైరుధ్యం కనుపించుతూ వుంటుందో అంతర్గర్భితంగా, అలాంటి ప్రధానమైన సాన్నిహిత్యం కూడా వున్నది. రాజకీయంగానూ, ఆర్థికంగానూ, సాంఘికంగానూ ఈ రెండు దేశాల మధ్యనూ ఎంతో అవినాభావం యేర్పడటానికి చాలా సావకాశ మున్నది. అని ముఖర్జీ అన్నారు.

'ఈ అధునాతన యుగంలో భౌతిక ఆధ్యాత్మిక శక్తుల మధ్య సామరస్యమేర్పడటం చాలా అవసరం. ప్రపంచంలో ఇలాంటి సామరస్యం రావటానికి అమెరికా భారత దేశాలు యెంతో సహకారంచేయగలవు. అధునాతన యుగంలో మానవుని అస్తిత్వానికి అనువైన తాత్విక జ్ఞానాన్ని పెంపొందించగలవు ఈ రెండు దేశాలమధ్యనూవున్న వైవిధ్యాలను తిలకించి అంతర్గర్భితంగా వున్న అవినాభావాన్ని గుర్తించలేని కొందరు విమర్శకులు, వీటి రెంటిమధ్యనూ శాశ్వతమైన బాంధవ్యమనేది యేర్పడటానికి యేమైన ఆస్కారమున్నదా అని విస్తుపోతూవుంటారు. సాంఘికంగానూ, రాజకీయంగానూ, ఆర్థికంగానూ ఈ రెండు దేశాలమధ్యనూ చాలా భేదాలున్నమాట నిజమే. రెంటికీ చారిత్రక పరిణామాలకూ కూడా భేదావుంది మరి, గార్హస్థ్య వ్యవస్థలలో అసలెక్కడా సంబనా పొంతనాలేదు ఇదంతా నిజమే. సందేహంలేదు. కాని ఒక్క విషయంమాత్రం గమనార్హం భారతదేశంలో, రాజకీయంగా చైతన్యం పొందిన ప్రధాన వర్గాలకు అమెరికాపట్ల చాలా కౌతుక్యంవుంది అమెరికా రాజకీయ సిద్ధాంతాల ప్రభావం వారిమీద చాలా బలంగావుంది. ఇక్కడికి అర్థ

2-వ పేజి చూడుడు

#### "కాశ్మీర్ విభజన పనికిరాదు"

##### పాకిస్థాన్ రాయబారి ప్రకటన

న్యూయార్కు, డిశంబరు 11 "కాశ్మీర్ సమస్యను పరిష్కరించటానికి జనవాక్యాన్ని నిర్ధారించవలసినదేకాని దానిని విభజించటం పనికిరాదు విభజించటానికి కాశ్మీర్ ఒక ఆస్తిలాంటిదికాదు. కాశ్మీర్ ప్రజలు స్వయంనిర్ణయాధికారం. ఉండలనే మేము కోరుతున్నాము" అని పాకిస్థాన్ సంచార రాయబారి నవాబ్ ముష్తాక్ అహమద్ గుర్మానీ నేడిక్కడ ప్రకటించాడు.

భద్రతామండలి 17 వ తేదీన కాశ్మీర్ సమస్యపై చర్చజరిపేటప్పుడు పాకిస్థాన్ ప్రతినిధిగా వ్యవహరించబోతున్న సర్ జఫ్రుల్లాఖాన్‌కు తోడ్పడే నిమిత్తం ఇతడు లండన్‌నుంచి ఇక్కడికి వచ్చాడు.

## ధర్మకర్తృత్వ పాలనలో నూత్న అధ్యాయ ప్రారంభం

### సమితి సమావేశంలో చిన్నరాజ్యాల ప్రాభవం స్పష్టపడిందని సర్ బి. ఎన్. రావుగారి ప్రశంస

ఫ్లషింగ్ మెడోస్, డిసెంబరు 12. ఐక్యరాజ్యసమితి చతుర్థ సమావేశంలో అల్పరాజ్యాల ప్రాభవం బాగా వ్యక్తమైనదని ఇండియా ప్రతినిధి సర్ బి. యన్. రావు నేడు అన్నారు.

కెనడియన్ బ్రాడ్‌కాస్టింగ్ కార్పొరేషన్‌వారు ఏర్పాటు చేసిన రేడియోప్రసంగంలో సర్ బి. ఎన్. రావు అల్పరాజ్యాల ఈ ప్రాభవం ముఖ్యంగా లిబియా, సోమాలీలాండ్ ప్రభృతి ఇటలీ వలసరాజ్యాల సమస్యను పరిష్కరించే సందర్భంలో బాగా స్పష్టపడిందని వివరించారు.

"గడచిన మేసెలలోనే ఏటి సమస్య సమితిలో విచారణకు వచ్చిందిగాని, చివరకు 2/3 వంతు మెజారిటీ రాకపోవడం వల్ల చేసిన ప్రయత్నమంతా వమ్మయిపోయింది అప్పుడు అంత మెజారిటీ రావడానికి ఒక్క ఓటు తక్కువై పోయింది.

నిజంగా అప్పుడా తీర్మానాన్ని అంగీకరించి వున్నట్లయితే, లిబియా స్వాతంత్ర్యం 10 ఏండ్లదాకా వాయిదాపడివుండి, అది అంతర్జాతీయ ధర్మకర్తృత్వం క్రింద అందాకా మెలగవలసి వచ్చేది.

అందువల్ల తిరిగి ఆ సమస్య సమితి ఈ సమావేశంలోనూ చర్చకువచ్చింది ఇప్పుడు ఇంకో తీర్మానాన్ని సమితి ఆమోదించింది దీనికి ఎంత మెజారిటీ బలం అవసరమో అంతబలమూ వచ్చింది. దీనిప్రకారం లిబియా సర్వస్వాతంత్ర్యం లభ్యమౌతుంది మహా ఆలస్యం అయితే, 1952 జనవరి 1 తేదీని మించిపోయేందుకు వీలులేదని ఒక నియమంగూడా ఆ తీర్మానంనిబంధంచేసింది

ఇందువల్ల తేలినదేమంటే, ఒక చిన్న రాజ్యం తన ఓటుతో ఎంతటి జటిలసమస్య పరిష్కారంకావడానికిదోహదంగా వుండే

దీన్నే వ్యక్తమౌతున్నది అంటే సమితిలో అల్పరాజ్యాల ప్రాబల్యం వృద్ధిఅవుతున్న జాడలు బాగా కనబడుతున్నాయి.

చిన్నరాజ్యాలన్నీ కలిసి పనిచేయడంచేత ఎంతటిపనిని నిర్వహించగలిగింది ఈ ఒక్క విషయం తెలియజెప్తోంది.

(2-వ పేజీ చూడుడు)

## భారతీయవ్యాపారస్థులకు ధైర్యవిశ్వాసాలు ఏర్పడగలవని ఖజానా మంత్రి అభయం

### దేశం ఆర్థిక దుస్థితిని గడచి గట్టెక్కగలిగినదని మత్తయి ప్రకటన

కలకత్తా, డిసెంబరు 12: "భారతదేశములోని వ్యాపారస్థులను ఇంతకాలమునుండియు ఆశాభంగము నిరుత్సాహము ఆవరించి వున్నవి. కాని యికముందు ఆశాభావము ధైర్యవిశ్వాసములు ఏర్పడి, రాగల సంవత్సరమునందు వర్తకులకు ఆదుర్దా చాలావరకు తగ్గగలదు" అని కలకత్తాలోని అసోసియేటెడ్ వాణిజ్య మండలి వార్షిక సమావేశమునందు ఇండియా ప్రభుత్వ ఖజానా శాఖామంత్రి జాన్ మత్తయిగారు నేడుదయము ఉపన్యసించుచు అభయ హస్తమిచ్చిరి.

"ఆదాయపుపన్నులను చెల్లింపక తప్పించుకొను చుండుటవల్ల ఏర్పడిన సమస్య విషయములో పరిస్థితులింకను అసంతృప్తికరముగానే వున్నవి. వ్యాపార ప్రపంచములో ఏర్పడిన అనిశ్చయావస్థ ఇంకను యథాపూర్వముగానే యుండుటవల్ల వ్యాపారస్థులు తమ వద్దనున్న ద్రవ్యమును దీర్ఘకాల వ్యవధిలో ప్రతిఫలావకాశములు గల పరిశ్రమల నెలకొల్పుటకై వినియోగించుటలేదు" అని ఆర్థికమంత్రి చెలిపెను.

డాక్టర్ మత్తయ్ తమ ఉపన్యాసంలో ఇంకా ఈ క్రిందివిషయాలు వివరించారు

"ఆదాయపు పన్నులను చెల్లింపక ఎగ బెట్టినవారికి ప్రత్యేక సౌకర్య లాభములను సదుపాయ సహాయములను గవర్నమెంటువారు కలుగజేసిన యెడల, న్యాయంగా ఆదాయపు పన్నులను చెల్లించేవారిని నిరుత్సాహ పరచినట్లగును. ఆదాయపు పన్నులను చెల్లింపక తప్పించుకొన్న వారికే గవర్నమెంటు పారితోషిక మిచ్చుచున్నారని లోకము నిందించగలదు. అక్కరకు వచ్చేడిరీతిగా నూతన పరిశ్రమల నిర్మాణమునకై వర్తకులు తమవద్దనున్న ద్రవ్యమును పెట్టుబడి పెట్టకుండా తమ ద్రవ్యమును చాటుమాటుగా సరకులను కొని అమ్మక వ్యాపారంలో వినియోగించుకొను చుండేయెడల, దేశములో ద్రవ్యచలామణీ మాత్రము అధికమగును ధరలుపెరిగి ద్రవ్యోల్బణ మేర్పడును. కాని, నూతన వస్తుసామగ్రుల సుత్పత్తి చేయగల పరిశ్రమలకొరకై ఆ ద్రవ్యము వినియోగముకాదు. ఆదాయపు పన్నులను ఎగబెట్టినవారి విషయమై పరిశీలించుటకొక దరియాప్తు కమిటీ ఏర్పాటు చేయబడెను. ఈ కమిటీ పరిశీలనార్థము కొన్ని కేసులు నివేదింపబడెను. కాని యీ కమిటీ పరిశీలనార్థము నివేదింపబడని వ్యాపార సంస్థలనేకములవు. అట్టి వ్యాపారసంస్థల భాగస్థులు తమంతట తామే తమ ఆదాయపు లెక్కలను విశదపరచి తమ గుప్త ఆదాయములను చూపించి ఎగబెట్టిన ఆదాయపు పన్నును తమంతట తామే చెల్లించిన యెడల అట్టివారి యెడల నేరారోపణలు జరుగవని ఒక మరతు ప్రకటింపబడెను. ఆరీతిగా వారికి ఒక మరతును వర్తింపజేసినయెడల వ్యాపార రంగములోనికి ఎక్కువ ద్రవ్యము కొత్త పెట్టుబడుల రూపంగా ముందుకు రాగల్గుటకవకాశ మేర్పడునని యూహించుచున్నాము ఈ సమస్యను ఏదో విధముగా రాజీ పద్ధతిగానైనను పరిష్కారము చేసిననే తప్ప, ఎన దేశము యొక్క ఆర్థిక పునరుజ్జీవనమున కొక ప్రతిబంధక మేర్పడును.

ఇండియా గవర్నమెంటు ఇటీవల తనకు కావలసిన ఋణమును ప్రజలవద్ద నుండి వసూలు చేసికొనజాలక ఆశాభంగమును పొందినది. ప్రస్తుత ఆర్థిక స్థితిలో తగినంత హెచ్చు వడ్డీరేటు ఉంటే, ప్రభుత్వానికి ద్రవ్యం పెట్టుబడి పెట్టుటకు కుతూహలపడే వారని నేను భావింపను. ద్రవ్యోల్బణము

(2-వ పేజి చూడుడు)

#### అస్సాంలో భూకంపం

దుబ్రి (అస్సాం) డిశంబరు 11. ఇక్కడ ఈ రాత్రి 1-10 గంటలకు తీవ్రమైన భూకంపం సంభవించింది. పూర్తిగా ఒక నిమిషంసేపు భూమి కంపించింది. 1930 తర్వాత ఇంత తీవ్రమైన భూకంపం ఎప్పుడూ రాలేదు. అనేక ఇళ్లు గోడలు అటు ఇటు వూగి బీటలు వారినవి. జననష్టం ఏర్పడినట్లు ఇప్పటి వరకూ వార్తలేమీ లేవు



#### "ఫ్రెంచి ఇండియాలో ఓటర్ల జాబితాలు సరిఅయినవి కావు"

##### స్థానిక నాయకుల ప్రకటన

పుదుచ్చేరి, డిశంబరు 11 — ముందు జరుగబోతున్న జనవాక్య నిర్ధారణకో నూటికి 60 వంతుల చొప్పున ప్రజలు వోటింగ్ చేయాలని ఫ్రెంచివారు చేస్తున్న ప్రతిపాదనను ప్రతిఘటించుచూ, భారత దేశపు ఫ్రెంచి వలసల నాయకులు నెహ్రూకు ఒకతంతివార్తను అందజేశారు. "జాతీయ విముక్తి సంఘం అధ్యక్షులు లహాబీగారూ, పాండిచేరీ పట్టణ కాంగ్రెస్ సంఘం అధ్యక్షులు జీవరత్నంగారూ సంయుక్తంగా ఈ తంతివార్తను అందజేశారు. ప్రస్తుతమున్న రాజ్యాంగ శాసనాన్నిబట్టి నూటికి 25 మందికంటే యెక్కువమందివోటుచేసే అధికారంలేదు. నూటికి 60 మంది పాల్గొనాలనేది ఆ శాసనానికి విరుద్ధం. తిరిగి వోటర్ల జాబితాల సమగ్రపద్ధతిని తయారుచేయటానికి యెన్నడూ ప్రయత్నంజరుగలేదు. ఫ్రెంచివారు ఏకపక్షబాధ్యతతో ఇప్పుడు తయారుచేసిన జాబితాలు వట్టిదగా జాబితాలు. వాటిప్రకారం ప్రజాభిప్రాయ స్వీకరణ జరగటం చాలా అక్రమం. భారత ప్రభుత్వాధికారులతోనూ, ఫ్రెంచి అధికారులతోనూ యేర్పడిన సంయుక్త సంఘం తయారుచేస్తేనేతప్ప సక్రమమైన వోటర్ల జాబితాలు తయారుకావు. అని ఆ తంతివార్తలో తెలియజేశారు.

## జనవరి 26 కు ఆంధ్రరాష్ట్రం రావచ్చుననే ప్రణాళికతో మద్రాసు ప్రభుత్వ సన్నాహాలు

### డిసెంబరు ఆఖరుకే ఏర్పాట్లు ముగించు సంకల్పం

#### రాష్ట్రము వచ్చు తేదీ విభజన సంఘ సభ్యుల రాయబార ఫలితంపై ఆధారపడిఉన్నది

చెన్నపట్నం, డిసెంబరు 12. జనవరి 26 వ తేదీకి ఆంధ్రరాష్ట్రం రావచ్చుననే ఉద్దేశ్యంతో ఆయాశాఖలవారు సన్నాహపడవలసినదిగాను, వారు కోరిన సమాచారమును తక్షణమే పంపవలసినదిగాను ప్రభుత్వంవారు జారీచేసిన సర్క్యులరు చాలవరకు అన్నిశాఖలవారికి నేడు అందినటుల తెలియుచున్నది. విభజన సంఘంవారు ప్రత్యేకరాష్ట్రమును జనవరి 26 కు సాధ్యమైతే అమలులోకి రప్పించాలనే ధోరణితో పనిచేస్తున్నారు ఏప్రిల్ 1 వ తేదీనుంచైతేగానిఆంధ్రరాష్ట్రింపనిచెయ్యడం అంత వీలుకాదు అని కేంద్రప్రభుత్వం వారు చెప్పి వున్నందున కేంద్రప్రభుత్వంతో సంప్రదింపులు జరుప టి. టి. కృష్ణమాచారి,వెంకట్రావుగారలు యత్నించెదరు జనవరి 26 వ తేదీకి ఆంధ్ర రాష్ట్రము వచ్చుటకు కేంద్రప్రభుత్వము అంగీకరించినదీ లేనిదీ డిసెంబరు 21 వ తేదీకి వెంకట్రావు కృష్ణమాచారిగారలు వచ్చునాటికి తేలిపోగలదు. ఆయా డిపార్టుమెంటులలో ఆంధ్రులు ఎందరు ఉన్నారు, ఆంధ్రేతరులు ఎందరు ఉన్నారన్నది తెలుపవలెనని కోరబడినదనియు, 'ఆంధ్ర' శబ్దమునకు ఆంధ్రదేశం 11 జిల్లాలలోను, కుటుంబాలతో పదిఏళ్లుగా వలస ఉండిపోయిన వారని నిర్వచనము తెలుపుచున్నారనియు తెలియుచున్నది

జనవరి 26 కైతే రాష్ట్రనిర్మాణము సాధ్యముకాదని మద్రాసు ప్రధాని తెలిపినను, మద్రాసు మంత్రివర్గము నిర్ణయించినను, విభజన సంఘములోని ఆంధ్ర తమిళ నాయకులు జనవరి 26 కే రాష్ట్రము వచ్చుటకు యత్నములు చేయుచున్నారు. మద్రాసు ప్రధానిగూడా కేంద్రప్రభుత్వమువారు అంగీకరించినచో తమకట్టి అభ్యంతరము లేదని తెలిపినటుల తెలియుచున్నది

ఆంధ్రుల రాజధాని, హైకోర్టు పెట్టుకొనుస్థలములు పేర్లు చెప్పవలెననియు, ఆంధ్రరాష్ట్రము వచ్చిన తరువాత ఆంధ్రుల హైకోర్టు, రాజధాని కార్యాలయములు లాంఛనముగా అచ్చట పెట్టుకొనవలెననియు, మంత్రులు మద్రాసులో ఉన్ననూ శాసనసభ సమావేశములు మద్రాసులో జరుపుకొనరాదని తమిళనాయకులు ప్రస్తుతము వాదించుచున్నటుల తెలియుచున్నది. ఇది ఎంతవరకు ఆచరణీయమన్నది ఆంధ్రనాయకులు పరిశీలించుచున్నారు.

ఆంధ్రుల హైకోర్టు ఎక్కడ పెట్టు

(2-వ పేజీ చూడుడు)

#### బియ్యం మరల లైసెన్సు

##### క్రొత్తవాటికి యిక యివ్వరు

దంపుడు బియ్యం ప్రోత్సాహానికి ప్రభుత్వచర్య

మదరాసు, డిశంబరు 12. ప్రభుత్వంవారు యిట్లు ప్రకటించుచున్నారు :-

బియ్యంలో పుష్టి పోకుండా నుండుటకై మిల్లులో దంపుడు వీలయినంత తగ్గించి, చేదంపు పద్ధతి ఎక్కువ చేయుటకు ప్రభుత్వం వారుద్దేశించిరి. అందుచే, మదరాసు బియ్యం మరల లైసెన్సింగు ఆర్డరు 1947 ప్రకారం, యిచ్చే లైసెన్సులు యికముందు క్రొత్త బియ్యం మరలకు యివ్వరాదని నిశ్చయించిరి జిల్లా కలక్టరు లందరికి అవసరమగు ఉత్తరువులు యిందు విషయమై జారీ చేయబడినవి

## తుపానువల్ల కలిగిన నష్టానికి శిస్తురెమిషను

చెన్నపట్నం, డిసెంబరు 12 తుపానువల్ల విశాఖ తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి కృష్ణా గుంటూరుమండలములలో పంటలకు కలిగిన నష్టమునకై పై జిల్లాలందు యీ దిగువ తెలుపబడినప్రకారం శిస్తురెమిషన్లు నొసగుచూ ప్రభుత్వము ఉత్తరవుచేసియున్నది

6 అణాలు అంతకంటె తక్కువ ఫలసాయం లభించే అన్ని మాగాణి పంటలకు పూర్తిశిస్తు ముజరా యివ్వబడును 6 అణాలు పైబడి 8 అణాలమధ్య ఫలసాయం లభ్యమైనపంటలకు సగము శిస్తు ముజరా నొసగబడును. పూర్తిగా నష్టమైన జరీబులు దుఫసల్ పంటలకు పూర్తి రెమిషను యిచ్చెదరు.

మెట్టభూములలో వరి తదితర మాగాణి పంటలు సాగుచేసినవారికి పైరేటుప్రకారమే నీటితీరువ ముజరా నివ్వబడును.

కొబ్బరితోటలకు ముజరా నిచ్చేవిషయముగూర్చి ప్రభుత్వము ప్రత్యేకముగా ఆలోచించుచున్నది.

ఈ రెమిషన్లు జైమ్యారీప్రాంతాలకు యేరీతిగా వర్తించునో ఎస్టేటు రద్దుచట్టము క్రింద ప్రభుత్వము వశపరచుకొన్న ఎస్టేట్లకుకూడా అదేప్రకారం వర్తించును.

## గంటల పంచాంగం

విరోధి సం॥ మార్గశిర బ॥ అష్టమి 1949 సం॥డిసెం॥ 13 మంగళవారం
సుం॥ అష్టమి సా 6-27 ఉ ఫ తె4-37వర్జ్యం ప 12-35 ల 2-7 వ.

బ॥ నవమి డిసెం॥ 14 బుధవారం
బు॥ నవమి ప 4-30హస్త రా 8-11వర్జ్యం ప 12-31 ల 2-2 వ.

ఆంధ్రపత్రిక
విరోధి సం॥ మార్గశిర బ॥ అష్టమి
మంగళవారం

## ఆస్ట్రేలియా ఎన్నికలు

ఆస్ట్రేలియాలో ఎనిమిది సంవత్సరములు, న్యూజిలాండ్‌లో పదునాలుగు సంవత్సరములు పరిపాలనను కొనసాగించిన కార్మిక పక్షములు ఇంచుమించు ఏక కాలమున పదభ్రష్ట మగుటను ప్రపంచ రాజకీయములందు చైనా కమ్యూనిస్టు పక్ష విజయము తరువాత అత్యంత ప్రధానమైన సంఘటనగ భావింపవలసి యుండును. 1945 వ సంవత్సరమున బ్రిటన్‌లో కార్మిక పక్షము కన్సర్వేటివ్‌ల గెల్చి అధికారమునకువచ్చుట, అమెరికాలో "డెమోక్రాటిక్" పక్షము అధికారమును నిలుపుకొనుటను బట్టి ప్రపంచ ప్రజలు అభ్యుదయ మార్గమును అనుసరించి పురోగమించుచుండిరని ఎంచబడెను. ప్రజలకు, తమకు సమ్మతమైన ప్రభుత్వమును ఎన్నుకొనుటకు సంపూర్ణమైన స్వేచ్ఛయుండిన, వారు ఏ దేశమునకు చెందినవారైనను ప్రజాస్వామ్య పద్ధతులను అనుసరించి ప్రజాభ్యుదయ సాధనకు కృషిచేయు రాజకీయ పక్షమునకే పరిపాలనాధికారమును దఖలు చేయుదురనుట నిర్వివాదము. బ్రిటన్‌లో గత నాలుగు సంవత్సరములలో జరిగిన ఉపఎన్నికలు ఈ విషయమునే స్పష్టముచేసెను.

ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ ఎన్నికల ఫలితములను బట్టి ఈ వాదము సహేతుకము కాదేమో యను సందేహము కలుగక మానదు. ప్రజలు, అది తమ పరముగ ఏర్పడినదే అయినను నియంతృత్వమును సహింపరని తమ సాంఘిక, ఆర్థిక జీవితమునందు పరిమితముగానైనా స్వాతంత్ర్యమును వాంఛించుచున్నారని మాత్రమే ఈ ఫలితములు వెల్లడించుచున్నవి. ఆ విధముగ ప్రజలు తమ కమ్యూనిజం విముఖతను ప్రకటించిరి. ఏమాత్రము అవకాశము వున్నను ప్రజలు కమ్యూనిస్టు వ్యవస్థ స్థాపనమును ప్రతిఘటింతురని ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ ఎన్నికలు ఋజువుచేసెను. ఆస్ట్రేలియా ఎన్నికలలో పోటీచేసిన కమ్యూనిస్టు అభ్యర్థులందరు తమ 'ధరావత్తు'ను కోల్పోయిరి.

అయితే, ఆస్ట్రేలియా ప్రజాసామాన్యమునకు ఎనిమిది సంవత్సరములు, సర్ రఘునాథ్ పరంజ్పై గారు అన్నట్లు, నిరుపమానమైన సేవ చేసిన కార్మిక ప్రభుత్వము పదభ్రష్ట మగుటకు కారణము లేమి? ఆస్ట్రేలియాకు ప్రధానమంత్రి కానున్న రాబర్టు మెన్జెస్ తమ పక్ష విజయమునకు కారణములను పేర్కొనుచు ప్రజలు 'కంట్రోల్స్'తో విసుగెత్తిరనియు, ఆస్ట్రేలియా ప్రభుత్వము సంకల్పించిన బ్యాంకులను జాతీయము చేయు కార్యక్రమము మధ్యతరగతివారిలో, ధనికవర్గములలో తీవ్ర అసంతృప్తిని కల్గించెననియు, కొందరు మంత్రులు "అధికారోన్మత్తులై" ప్రజల హక్కులను గౌరవించుటకు బదులు తృణీకరించుట జరిగెననియు, వీటన్నింటి వలన ప్రజలు ప్రభుత్వమునందు మార్పును కోరుట జరిగినదనియు తెల్పిరి.

కామన్వెల్తు దేశములందు వచ్చిన ఈ మార్పులవలన కామన్వెల్తు వ్యవస్థలోగాని, కామన్వెల్తు రాజ్యముల పరస్పర సంబంధములందుగాని విశేషమైన మార్పు కలుగక పోవచ్చును. కాని 1950 వ సంవత్సరమున బ్రిటన్‌లో జరుగనున్న ఎన్నికలలో తిరిగి కార్మిక పక్షము 1945 వ సంవత్సరమున పొందిన అఖండ విజయమును సాధింపలేక పోవచ్చును. గత ఎన్నికల్లలో కార్మిక పక్షము వారు "తాము అధికారమునకు వచ్చిన సోవియట్ రష్యాతో బ్రిటన్ సంబంధములు స్నేహపూర్వకముగ నుండునని, తత్ఫలితముగ తృతీయ ప్రపంచసంగ్రామము నివార్యమై ప్రపంచశాంతి స్థిరపడునని ప్రచారము చేసినట్లే ఇపుడు కన్సర్వేటివ్ పక్షమువారు తాము అధికారమునకు వచ్చిన సామ్రాజ్య బంధములు దృఢతరములై బ్రిటిష్ ప్రజల జీవన ప్రమాణము వృద్ధియై కంట్రోల్సు అనవసరమగునని ప్రచారముచేసి విజయమును సాధింపవచ్చును.

భారతదేశమునకు ఇట్టి ప్రమాద మేర్పడవచ్చును. 1950-51 సంవత్సరములో నూతన రాజ్యాంగమును అనుసరించి, వయోజన వోట్లు పద్ధతిన ఎన్నికలు జరుగనున్నవి. ప్రస్తుతము అధికారమునందున్న కాంగ్రెస్‌పక్షము, అంత దృఢముగ, ఫలప్రదముగ గాక పోయినను, ఇతర కామన్వెల్తు రాజ్యములు అనుసరించుచున్నట్టి విధానములనే అనుసరించుచున్నది. 1950 జనవరి 26 న ఏర్పడు ప్రభుత్వము ప్రస్తుత ప్రభుత్వమునకు భిన్నమైనది కాదు గనుక, ఇప్పటి విధానములనే అనుసరింప వచ్చును. రాష్ట్రములందును ఇప్పటి మంత్రివర్గములే అధికారమునందుండును గనుక రాష్ట్రపరిపాలనా విధానమునందెట్టి మార్పు ఉండక పోవచ్చును. 1951 ఎన్నికలలో కాంగ్రెస్ విజయమును పొందవచ్చును. కాని ఆ విజయము గణనీయమైనదిగ నుండవలెనన్న ప్రస్తుత ప్రభుత్వ విధానములు ప్రస్తుత పరిస్థితులకు భవిష్య దవసరములకు తగినట్లుగ మార్పు చెందవలెను. ఆస్ట్రేలియా, న్యూజిలాండ్ ఎన్నికలనుండి భారత ప్రభుత్వము గ్రహింపవలసిన దిదియే.

## మహా విదర్భరాష్ట్రం

### ఎస్. వి. గాడ్గిల్ వివరణ

నాగపూరు, డిసెంబరు 11 : నేటిసాయంకాలం కేంద్రమంత్రి ఎస్. వి. గాడ్గిల్ ఇక్కడి పత్రికావిలేఖరులతో మాట్లాడుతూ మహావిదర్భ రాష్ట్రస్థాపన సర్దారు పటేలు పూనికపై జరుగునుందని మహారాష్ట్ర పత్రికలలో ప్రచురించినవార్తలు నిజంకావనీ, తన అభిప్రాయంలో విరారుతోను, సి. పి. లోని మహారాష్ట్ర జిల్లాలతోనూ, కలిపి మహావిదర్భరాష్ట్రం ఏర్పరచడంకంటె మహారాష్ట్రులందరూ కలిసి నూతన రాజ్యాంగం క్రింద మహారాష్ట్రస్థాపన కొరకు ఆందోళన చేయడం సముచితమనీ, మరి పదేళ్ళవరకు కేంద్రప్రభుత్వం పైన గంగాప్రాజెక్టు నిర్మించలేరనీ అన్నారు.

## అమెరికా, భారతదేశాల సహకార ప్రాధాన్యం

(1-వ పేజీ తరువాయి)

శతాబ్దం క్రితం, భారతదేశం మీదయే ప్రభుత్వం ఆధిపత్యం చలాయిస్తూ వుండేదో, అదే ప్రభుత్వం మీద విప్లవం లేవదీసి స్వాతంత్ర్యాన్ని సాధించుకొన్నది. అమెరికన్ ప్రజలు తమదేశం ముక్కలు కాకుండా కూడా నిలవదీసుకో గలిగారు. అనేక కష్టనష్టాలకు ఓర్చి అమెరికా సమైక్యత దిగ్గన్నం కాకుండా కాపాడుకో గలిగారు. మొదట్నుంచీ "అవిభాజిత మాతృభూమి" ఆదర్శంతో పోరాడుతూ వచ్చినా భారతదేశం దాన్ని సాధించుకోలేక పోయింది. అమెరికా చారిత్రక పరిణామమే, ఆదేశపు ప్రజలలో ఇతర వెనుక బడిన ప్రజానీకాల పట్ల సానుభూతిని చూపే మానసిక స్థితిని సృష్టించ గలిగింది. ఆనాడు అమెరికా, ప్రపంచంలోని పీడిత జాతుల కన్నిటికీ ఆశాదీపంగా వ్యవహరించింది. ప్రపంచంలోని రాజకీయ కాందిశీకు లందరకూ, భారతదేశం వారికిగూడా, ఆశ్రయమిచ్చి ఎంతో ఆదరించింది. అమెరికా స్వాతంత్ర్య చరిత్ర, అమెరికా ప్రజలకు ప్రజాస్వామిక వ్యవస్థల పట్లగల ఆదరాభిమానాలూ, భారత ప్రజలను ఎంతో ఉత్సాహపరచినై. ఇప్పుడు భారతదేశం కూడా స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్న కారణంగా ఈ రెండు దేశాల బాంధవ్యం, మరింత బలపడటానికి సావకాశం వున్నది.

'అమెరికా ప్రజలకు, ఇటీవలివరకూ, భారతదేశపు వ్యవహారాలపట్ల అంత ఉత్సాహం లేకుండావున్నా, భారతదేశపు మహాపురుషులు కొందరు ఎడనెడా, భారతదేశపు జీవనవిధానాన్ని గురించి అమెరికా ప్రజలకు తెలియజేస్తూ వచ్చారు. శ్రీ వివేకానందస్వాములవారిని, అమెరికావెళ్ళిన భారతదేశపు ప్రథమ అనధికార రాయబారిగా చెప్పవచ్చును. ఆయన ఈ రెండు దేశాల నాగరకతా వాహినులకూ మధ్య ఆధ్యాత్మికంగా శాశ్వతమైన వంతెనను నిర్మించారు. అనంతరం మహాత్మాగాంధీ, రవీంద్రులు భారతదేశాన్ని అంతర్జాతీయ రంగంలోకి తీసుకుపోయి, అమెరికా ప్రజలకు సన్నిహిత చేశారు. ప్రధాని నెహ్రూ పర్యటనతో ఈ బాంధవ్యం మరింత దగ్గరకు వచ్చింది. అంతర్జాతీయరంగంలో భారతదేశం నిర్వహించబోతున్న ప్రధాన పాత్రను అమెరికా ప్రజలు అర్థం చేసుకో గలిగారు.

'ఆసియా వ్యవహారా లన్నిటికీ భారతదేశం కేంద్రభూమి. ఈ గడ్డమీద అనేక కష్టాలు కేంద్రీకరించుకొని పని చేస్తున్నయ్. ఆసియాను అంతర్జాతీయ రాజకీయరంగంలో బలవత్తరమైన శక్తిగా పెంపొందించటం మా పరమాశయం. ప్రపంచం సర్వత్రా సలస పరిపాలనలు అంతం కావాలనీ వాస్తవికమైన సర్వమానవ సమానత్వం యేర్పడాలనీ, సామరస్యం పెంపొందాలనీ వాంఛిస్తున్నాను. ఇలాంటి విధానాన్ని అనుసరించుతున్న కారణంచేత, మేము ఒక్క అమెరికాతోనే కాకుండా, ఐక్యరాజ్యసమితి సిద్ధాంతాలను శిరసావహించగల యే దేశంతోనైనా సంపూర్తిగా సహకరించి పనిచేయగలం. రాజకీయంగా అన్ని దేశాలూ తమదేశపు జాతీయ సమైక్యతను బలపరచుకోవలసిన అవసరం వున్నా, ఇవి పరులను ద్వేషించే అనర్థకరమైన జాతీయతగా పెంపొంది అంతర్జాతీయ సోదరత్వాన్ని భగ్నం చేయగూడదు. ఈ మూల సిద్ధాంతాన్ని మనం విస్మరించకూడదు. మానవులకు గల వాక్స్వాతంత్ర్యాన్నీ, భావస్వాతంత్ర్యాన్నీ మనం రక్షించాలి.

'భారతదేశంలో, నేడు దారిద్ర్యమూ, అజ్ఞానమూ, రుజాకూదులూ విచ్చలవిడిగా తాండవించుతున్నయ్. వీటినుంచి వెంటనే విముక్తి రావాలని ప్రజలు యెంతో ఆతురతతో వున్నారు. దీర్ఘకాలంగా భారతదేశం విదేశీపరిపాలనక్రింద మ్రగ్గివున్న కారణంగా, సాంఘికంగానూ, ఆర్థికంగానూ ఎంతో వెనుకబడిపోయింది. స్వాతంత్ర్యం లభించిన వెంటనే, ఈ దుస్థితిని తొలగించవలసిన ప్రధానసమస్య భారతదేశం యెదుర్కొనవలసివచ్చింది. ఈ మహాకార్యాన్ని సాధించటంలో మాకు పశ్చిమార్థగోళంనుంచి తగిన ప్రోత్సాహసహకారాలు వస్తాయని ఆశించుతున్నాం.

'సహన సౌమనస్యాలు ప్రధానసూత్రాలుగా, ఈ సమావేశం రెండు దేశాలనూ సన్నిహితపరచగలదని విశ్వసించుచున్నాను' అన్నారు.

## చిత్తూరుజిల్లా కాంగ్రెస్ సహాయ కార్యదర్శి రాజీనామా

మదనపల్లి, డిసెంబరు 10 : చిత్తూరు జిల్లా కాంగ్రెసుసంఘ సహాయకార్యదర్శిత్వమునకున్నూ, మదనపల్లి పురకాంగ్రెసు సంఘ కార్యదర్శిత్వమునకున్నూ, నూతి రాధాకృష్ణయ్యగారు, ప్రస్తుతం కాంగ్రెస్‌లో యేర్పడిన కొన్ని అవకతవకల కారణముచేత తమ పదవులకు రాజీనామా యిచ్చిరి.

## ధర్మకర్తృత్వ పాలనలో నూతన అధ్యాయం

(1-వ పేజీ తరువాయి)

ఈ చతుర్థ సమావేశంలో సమితి నిర్వహించిన కార్యాలలో సోమాలీలాండుసమస్యా పరిష్కారంగూడా చెప్పుకోదగిందే.

సమితి ఇప్పుడు ఈ ప్రాంతాన్ని ఇటలీ ధర్మకర్తృత్వం క్రింద వుంచింది. ఈ ధర్మకర్తృత్వం 10 ఏండ్లపాటు సాగుతుంది. కాని ఇటలీ తన ఇష్టంవచ్చినట్లు ఈ ధర్మకర్తృత్వాన్ని నిర్వహించేందుకు వీలు లేదు. అందుకు ఒక ప్రత్యేకమైనరాజ్యాంగంవుంది. దాన్నిగూడా సమితే నిశ్చయించింది. ఇది చాలా ముఖ్యమైనవిషయం.

సమితి రాజ్యాంగాన్ని తయారు చెయ్యడమే కాకుండా, అది సరిగ్గా నిర్వహించబడుతున్నది లేనిదీ చూడడానికి గూడా సమితికి అధికారంవుంది.

అందువల్ల ధర్మకర్తృత్వ విషయంలో ఒక కొత్త అధ్యాయం దీనితో ప్రారంభమౌతున్నది. దీనికి ఇప్పుడు అమలులో వున్న ధర్మకర్తృత్వాలకు చాలా భేదం వుంది. చట్టబద్ధమైన రాజరికానికి, నియంతృత్వానికి ఎంత తేడా వున్నదో, వాటికీ, దీనికి అంత తేడావుంది.

ఈ చతుర్థ సమావేశంలో సమితి సాధించిన ఘనకార్యం ఇంకోటి వుంది. ఇది మూడోది.

స్వయంపాలితాలు కాని ప్రాంతాల విషయమై పర్యాలోచించేందుకు ఒక ప్రత్యేక సంఘాన్ని సమితి నియమించగల్గింది. ధర్మకర్తృత్వసంఘం ధర్మకర్తృత్వ ప్రాంతాలవిషయంలో ఎటువంటి పని చేసిందో, అటువంటి పనినే ఈ సంఘం స్వయం పాలితాలు కాని ప్రాంతాలకు చేస్తుంది.

ఇందువల్ల వలసరాజ్యాల పరిపాలనలలో తీవ్రమైన మార్పులు రావడం, అవి స్వతంత్ర రాజ్యాలుగా అవతరించడం జరుగుతుంది.

నిజానికి అణుశక్తి విషయంలోగూడా సమితి ఈ సమావేశంలో ఏదో చేసి వుండవలసింది. ఇప్పటికి అది చేజారిపోయింది. అయినా ఈవిషయంలో ఒక తీర్మానాన్ని ఆమోదించింది గాని, అది నాకు అంత యోగ్యమైనదిగా కనబడటంలేదు.

ముందు ఏదో జరుగుతుంది అన్న ఆశను చూపెట్టడం తప్ప ఈ తీర్మానంవల్ల జరిగేది ఏమీ లేదు. పూర్వం ఈ విషయంలో ఏమి జరిగింది అన్న విషయాన్ని పర్యాలోచించిన పాపానగూడా ఈతీర్మానం పోవడంలేదు.

ఏ విషయంలో ఒప్పందం కుదరాలో దాన్నే ఏకరువు పెట్టిందిగాని, పూర్వం ఎంతవరకు అగ్రరాజ్యాల మధ్య ఈ విషయంలో అంగీకారం కుదిరిందిఅన్న విషయాన్నిగూర్చి అందులో ఒక్కముక్క గూడాలేదు.

అందువల్లనే ఇండియా వేరేమార్గాన్ని సూచించింది. దానివల్ల ఆ అణుశక్తి కంట్రోలు కమిషన్ నిర్వహించిన కార్యభారమంతా ఒకరూపానికివచ్చే వీలు ఏర్పడేది. అంతే కాకుండా, ఈ విషయంలో ఒక అంతర్జాతీయ ధర్మాన్ని దిద్దడానికి గూడా ఇది మంచి దోహదాన్ని ఇచ్చివుండేది.

అణుశక్తి విషయమై కొన్ని ధర్మసూత్రాలు ఏర్పాటుచేసి, వాటిని సమితి సమర్పించవలసిందిగా అంతర్జాతీయ న్యాయసూత్ర సంఘాన్ని ఆదేశించాలని ఇండియా సూచించింది. ఇది గనుక జరిగితే, అణుశక్తి విషయంలో అంతర్జాతీయ ధర్మప్రణాళిక ఒకటి ఏర్పడేందుకు బీజావాపనం జరిగివుండేది.

కాని మా ఈ తీర్మానం వీగిపోయింది. ఇందువల్ల సమితి చేతులారా ఒక సదవకాశాన్ని జారవిడుచుకున్నదని నేను అనకతప్పడంలేదు.

కాని దీనికి వ్యతిరేకంగాను, అనుకూలంగాను ఓటుచేసినవారి సంఖ్యకంటే, తటస్థులుగా వున్నవారి సంఖ్య ఎక్కువగా వుంది. అందువల్ల ఆశ అనేది ఇంకా నాలో అణగిపోలేదు.

## జైలునుండి తప్పించుకు పోయిన ఖైదీ అరెస్టు

ఏలూరు, డిసెంబరు 10 : మూడు రోజులక్రిందట ఏలూరు సబుజైలునుండి జైలుగది తలుపు ప్రూచల తెగగోసి తప్పించుకొని పారిపోయిన షేక్ దావూద్ అనే వానిని గుంటూరు వాల్ పేట పోలీసు స్టేషన్ సబిన్స్పెక్టరు ఎన్. కనకరాజుగారు నిన్న అరెస్టు చేసి యిచ్చటకు తీసికొనివచ్చినారు. ఖైదీ పేరొందిన నేరస్థుడనీ, ఇదివరలో అనేకచోట్ల శిక్ష పడినవాడనీ తెలియుచున్నది. (స్వ. వి.)

## కమ్యూనిస్టు అరెస్టు

ఏలూరు సర్కిల్ ఇన్స్పెక్టర్ పి. వి. రమణరావుగారు నిన్న సాయంకాలం సేతల పోతరాజు అనే కమ్యూనిస్టును, పాలగూడెం గ్రామంలో అరెస్టుచేసిరి. పోతరాజు కొన్ని సంవత్సరాలుగా పోలీసులను తప్పించుకొని తిరుగుచున్నాడట. ఆతనివద్ద అభ్యంతరమైన కమ్యూనిస్టు వాఙ్మయమును గూడ పోలీసువారు స్వాధీనం చేసికున్నారు. (స్వ. వి.)

## డాక్టర్ మత్తయ్ అభయహస్తం

(1-వ పేజీ తరువాయి)

నకు ప్రతిక్రియగానైనను హెచ్చువడ్డీ రేటు ఉంచేటే మంచిదనికూడా, నేను భావింపను ఇందుకు మూలకారణము ప్రజలు తమ వద్దనున్న ద్రవ్యమును బయటకు తీసికొనివచ్చి పెట్టుబళ్లు పెట్టుటకు జంకుచుండుటయే యని తలంచుచున్నాను.

దీర్ఘకాలానంతర ప్రతిఫలముగల పత్రముల పెట్టుబళ్ళలో గత జూలై మాసమునుండియు ప్రజల పెట్టుబళ్ళు హెచ్చుచుండుట నాకు పంతృప్తి కలుగజేయుచున్నది. అప్పుడప్పుడు కొందరు సాహసించి తమ పత్రములను విశేషంగా అమ్ముజూపుటవల్ల అట్టి దీర్ఘకాలాయిదా పత్రముల ధరలు మార్కెటులో తాత్కాలికంగా తగ్గుచుండినప్పటికీ సగటుమీద అట్టి సర్కారు పత్రముల కిమ్మతు ఇంతవరకు క్రమక్రమంగా పెరుగుదలలోనేయున్నది. ఈ పత్రములను కొనుక్కొనేవారు తక్షణం బంధమైనవృత్తిలో నున్నవారు మాత్రమే గాక, ఇతరులుకూడా కొనుక్కొనుచున్నారు. ఈ పెట్టుబడిదార్ల వర్గము క్రమశః వెల్లగా విస్తరించుచున్నది.

బట్టల పరిశ్రమ విషయంలో ఒకమాట చెప్పవలసి యున్నది. తయారైన బట్టల పరకు ఎక్కువగా నిల్వయుండుటవల్లనే బట్టల మిల్లులందు ఉత్పత్తి తగ్గెను. అందువల్ల నిల్వ ఉన్న సరకును అమ్మివేయుటకై దానిని వివిధ ప్రాంతాలకు రవాణా చేయుటకై ప్రభుత్వము తగిన ఏర్పాటు చేయుచున్నది. దేశములోని బట్టలమిల్లులకు పాడుగురేజా. ప్రత్తిని గరిష్ట ప్రమాణంలో సప్లయి చేయుటకుకూడా గవర్నమెంటు ఏర్పాట్లు చేయుచున్నది. పాకిస్తాన్ ప్రభుత్వము తన రూపాయియొక్క మారకపురేటును హెచ్చు ప్రమాణములోనే ఉంచెను. పాకిస్తాను ప్రభుత్వమున్నూ ఇండియా ప్రభుత్వమున్నూ పరస్పరము సరకులపై విధించెడి సుంకముల విషయములో ఒక ఒడంబడిక చేసికొనవలెనని పాకిస్తానుకు మాచే ప్రబోధము. కాని అందుకు పాకిస్తాను సుముఖత్వమును చూపలేదు. ఆ కారణంచేత పాకిస్తానునుండి సప్లయి కాకనిలిచిపోయినటువంటి గోనువారకు ప్రత్తిని భారతదేశములోనే సమృద్ధిగా ఉత్పత్తి చేయుట అవసరమని భారత ప్రభుత్వము నిశ్చయించినది. ఇందుకొరకై చేయుచున్న ఏర్పాట్లు మన మూహించిన దానికంటె ఎక్కువ త్వరగానే ఫలించవచ్చును.

దేశములోని వస్తువుల ధరలు ఇంకా హెచ్చకుండా ధరలను ఒక స్థిరప్రమాణములోనికి తీసికొని రాగలిగితిమి. గత సంవత్సరాంతముకంటె ఆహార వస్తువుల వెలలు సర్వసాధారణంగా హెచ్చలేదు. ఒక్క తేయాకు విషయంలోను, చక్కెర విషయంలోను మాత్రమే ధరలు హెచ్చినవి. ఇటీవల గవర్నమెంటు అమలుజరిపిన చర్యలవల్ల జీవితావసరములైన వస్తువుల వెలలు తగ్గగలవు.

### జాన్ మత్తయిగారి పూర్తి యుపన్యాసం

మీ అసోసియేషన్ వర్తకసంఘ వార్షికసమావేశమునకు నన్ను మీరు తిరిగి ఆహ్వానించినందుకు మీకు కృతజ్ఞుడను. అనేక వ్యాపారశాఖలకు సంబంధించిన మీ అందరితో మరొకమారు నేను పరిచయమును కలుగచేసికొనుట కిదియొక మంచి అవకాశము. భారతదేశపు ఆర్థికరంగములో మీరు చాలా ప్రముఖపాత్ర నిర్వహించుచున్నారు.

ఇదివరలో మనము కలిసికొనియుండిన అనంతరము జరిగిన ముఖ్యమైన మూడు మార్పులనుగూర్చి నేను ముఖ్యందుగా ప్రస్తావింపదలంచితిని.

ప్రథమతః నే చెప్పదలచిన విషయమేమనగా విదేశాలతో మనకుగల వ్యవహార సంబంధములు—భారతదేశము స్వతంత్ర ప్రజారాజ్యము కానున్నది. కాని అట్టి స్వతంత్ర ప్రతిపత్తికి భంగములేకుండానే బ్రిటిష్ కామనువెల్తు కూటములో చేరియుండుటకు అంగీకరించినది. బ్రిటిషు కామన్‌వెల్తులోని యితరరాజ్యాల సద్భావసహృదయత్వముతో భారతదేశము ఆకూటములో చేరినది. కనుక ఆ కామన్‌వెల్తు రాజ్యాలతో స్నేహభావము పెంపొందగలదు.

అమెరికా సంయుక్తరాష్ట్రములతో మనకుగల వ్యవహారసంబంధము కూడా కొత్తఘట్టములోనికి వచ్చినది. ఇటీవల భారతప్రధానికి అమెరికాలో ఒసంగబడిన అఖండస్వాగతము ఆయనకు మాత్రమే చేయబడిన సొంతగౌరవంకాదు. భారతదేశమునకు ప్రపంచ రాజ్యములలో గణ్యత నొసంగునదైనది. రాజకీయంగా గాని, ఆర్థికంగా గాని అమెరికావారితో మనము ఒప్పందములను చేసికొనలేదు. అట్టి ఒప్పందములు చేసికొనకపోవడంవల్ల వారు మన ప్రధానమంత్రిని గౌరవించలేదు. అమెరికా ప్రభుత్వము తనంతటతాను యీ స్నేహభావమును చూపినది.

రెండవ విషయ మేమనగా దేశములోని వివిధ ప్రాంతములను సంఘటీకరణం చేయుటకు గత సంవత్సరం పూనుకోబడెను, అపని ఇప్పుడు పూర్తియైనది. ఈ సంఘటీకరింపబడిన ప్రాంతములు పరిపాలనా సౌకర్యము కలవై ఆర్థిక సామ్యము కలవై యున్నవి. కఠినసమస్యలు కొన్ని ముందున్నవి. కాని, ఇంతవరకు సాధింపబడిన వానికంటె అవి ఎక్కువకష్టమైనవి కావు. ఈ సంఘటీకరణమువల్ల ఆర్థిక వ్యవహారరంగములో కన్నంటెడి ప్రయోజనముకంటె మరే యితర రంగములోను ఎక్కువ ప్రయోజనం లేదు.

మూడవ ముఖ్యవిషయ మేమనగా మన భారత రాజ్యాంగ చట్టము తయారైనది. యితరదేశాలరాజ్యాంగచట్టములకంటె ఇది చాలా విస్తరించి పెద్దదిగా నుండవచ్చును. అయినప్పటికీ, మన రాజ్యాంగ చట్టము ఆచరణ యోగ్యమైనది. వెనుకటి ప్రాత ఇండియా ఆక్టువల్ల కలిగిన అనుభవ జ్ఞానము యీ కొత్త చట్టములో కలదు. అంతేగాక, మనదేశ స్వాతంత్ర్యము కొరకై పోరాడిన ధీరుల దూరదృష్టియును వివేచనాజ్ఞానమును యీ రాజ్యాంగచట్టములో ప్రతిఫలించుచున్నవి. ఉత్తరోత్తర భారతదేశ భవిష్యత్తున కొక ఆకార స్వరూపము తీర్చి దిద్దగల వారందరికిని యీ రాజ్యాంగము మార్గదర్శకమై సంకల్పబలమును చేకూర్చగలదు. భారతదేశము ప్రపంచరాజ్యాలలో సఖ్యతను సంపాదించినది. తన సరిహద్దులను తాను సమగ్రముగా బలవత్తరముగా రక్షించుకొనగల్గినది. స్వతంత్ర రాజ్యంగా ప్రయాణం సాగించుటకు తగిన రాజ్యాంగ నౌకను నిర్మించుకొనగల్గినది.

ఇట్టి పరిస్థితులలో మన ఆర్థికవ్యవహారములను మనము గమనించవలెను. ఈ ఆర్థిక వ్యవహారములే ఇక్కడ సమావేశమైన విషయములు కొని, యీ ఆర్థిక విషయములు అంత భీకరమైనవి కావు. మనకు ఆశాజనకములుగా ప్రోత్సాహకరముగా నీయున్నవి. ఈ ఆర్థిక వ్యవహారరంగములో గత సంవత్సర మంతయును మనము చాలా ఆందోళనపడియుంటిమి. మనము గత సంవత్సరం ఇచట కలిసికొనియుండినప్పుడు మన ఆర్థిక వ్యవహారములందు యిన్నిచిక్కులు కలుగునని మనమూహించి యుండలేదు. మనచిక్కులు ఇంకా పూర్తిగా తొలగిపోలేదు. కనుక ఇంకా కష్టించి కృషి చేయవలసియున్నది. మనకు సన్నిహిత భవిష్యత్తులో ఇదివరకువలె ఆదుర్దాపడవలసిన అగత్యం లేదు.

మీరు ప్రస్తావించిన ముఖ్యాంశములను విమర్శించుటకు పూర్వము మన ఆర్థిక పరిస్థితులను పర్యాలోకన చేయవలసియున్నది.

వస్తువుల ధరలు ఇంకా హెచ్చకుండా ఒక స్థిరప్రమాణంలోనికి తీసికొని రాగల్గితిమి. గత సంవత్సరాంత్యమునుండియు ధరలు హెచ్చలేదు, ఆహార ధాన్యముల విషయములో ధర క్రమేణా 1948 సం॥ నవంబరునుండి తగ్గినది. రూపాయిమారకంరేటు 'గ్గి'పువల్ల ఆహారధాన్యములవెలలు హెచ్చునని అనుకున్నారు కాని, తేయాకు విషయంలోను చక్కెర విషయంలోను మాత్రమే ధరలు హెచ్చెను. జీవితావసరములైన వస్తువుల ధరలను తగ్గించుటకై ఇటీవల గవర్నమెంటు జరిపినచర్యలమూలంగాను కొన్నిప్రాంతాల పంటలుచెడినను దేశం మొత్తముమీద రాబోయే పంట బాగా వుండగలదు గనుక సుదరల విషయములో మంచి పరిస్థితులే ఏర్పడగలవు.

బట్టలపరిశ్రమ విషయములో తప్ప తదితర పరిశ్రమలయందు 1949 జనవరి మొదలు సెప్టెంబరువరకు గడచిన 9 మాసాలలో ఉత్పత్తి హెచ్చినది. 1948 సం॥లో జరిగిన ఉత్పత్తితో సమానంగా ఉన్నది. జొన్న, ఉక్కు, కాగితం, గాజుసామాను 1948 ఉత్పత్తికంటె హెచ్చుగానే యున్నవి.

ఈ ఆర్థిక వ్యాపారాభివృద్ధికి రైల్వే రవాణాల అసౌకర్యమొక ప్రతిబంధకముగా నుండెను. ఈ విషయములో యీ సంవత్సరారంభములో చాలా దిద్దుబాటు చేయబడెను. కనుక రవాణా యిబ్బందులవల్ల పంటసరకులుగాని ఫ్యాక్టరీ సరకులుగాని సప్లయి అగుటలేదని చెప్ప వీలు లేదు. రైల్లు సకాలంలో నడుచుచున్నవి. వాగనులు సమృద్ధిగా సప్లయిఅగుచున్నవి. కాలహరణంలేకుండా రవాణాలగుచున్నవి. గత సంవత్సరంకంటె యీ సంవత్సరం ఈ విషయంలో అభివృద్ధికలదు.

పారిశ్రామిక సంస్థల షేరుల ధరలు 1946 సం॥ ఆగస్టు సెప్టెంబరులో చాలా ఉచ్ఛస్థాయిలోకి పెరిగెను. అనంతరం షేర్ల ధరలు తగ్గుచూ వచ్చెను. కాని ఈ సంవత్సరం జూలైలో తిరిగి షేర్లధరలు హెచ్చసాగెను. అప్పుడప్పుడు సాహసంగా ఎవరైనను విరివిగా షేర్లు అమ్మినప్పుడు మాత్రము తాత్కాలికంగా ధరలు తగ్గెను. ఇందువల్ల దేశములోని ఆర్థిక సంపత్తి ఎటువంటి గాలిపాటులో వున్నదీ తెలియగలదు. మన ఆర్థిక పరిస్థితి ముమ్ముందు యెంతటి వృద్ధిలోనికి రాగలదో బోధపడగలదు. షేర్లవ్యాపారం మాత్రముగా సాగుట ఎంత సభకరమో గ్రహించవలసియున్నది.

అంతేగాక దీర్ఘవాయిదా ప్రతిఫలంగల గవర్నమెంటు ఋణపత్రముల క్రయవిక్రయముకూడా ముఖ్యంగా గమనింపవలసి యున్నది. ప్రభుత్వము ఇటీవల ఋణముచేయు యత్నించనప్పుడు కలిగిన ఫలితప్రద్వ్యవసానం ఆశాభంగకరంగా ఉన్నది. కాని యీసమయంలో నే గవర్నమెంటు ఋణపత్రముల ధరలు తగ్గకుండా నిలకడకియేయున్నవి. ఇంగ్లండు వంటి దేశంతో పోల్చిచూచిన యెడల మారకపురేట్లు తగ్గిపోయినందున ఏర్పడిన గడ్డో లు దినములలో మనదేశములో యిటువంటి స్థిరప్రమాణంలో సర్కారు పత్రముల ధర లుండుట గొప్ప విషయము. ప్రభుత్వముయొక్క పరపతినిగూర్చియు మన దేశముయొక్క ఆర్థిక స్థితిగతులనుగూర్చియు తరచు ఆక్షేపించుచు మాట్లాడేవారి వాదనను పైజెప్పిన విషయము కొంతవరకు ఖండింపగలదు.

## పటేల్ సన్నిధిలో గజదొంగ నిర్బంధం

న్యూఢిల్లీ, డిసెంబరు 11 : పేరుపడ్డ గజదొంగ భూరాఖాన్ బికనీర్‌లో చిక్కిపోయినట్టు ప్రభుత్వం ఇటీవల ఒక ప్రకటన చేసింది. అతన్ని యెలా బంధించిందీ వివరాలు ప్రకటించలేదు.



ఇతన్ని బంధించటానికి, సర్దారు పటేల్ స్వయంగా వలపన్నారట.

ఇక్కడికి కొద్దివారాల క్రితం సర్దార్ పటేలు అల్పకాలం విశ్రాంతి తీసుకునే నిమిత్తం పిలనీ వెళ్లారు. ఆయన వెళ్లే పూర్వమే, రాజస్థాన్‌లోనూ, తూర్పు పంజాబ్, పాటియాలా ప్రాంతాలలోనూ, భూరాఖాన్, బన్వారీలనే గజదొంగల నాయకత్వాన వరుసగా దొమ్మీ, బందిపోట్లూ, స్త్రీల అపహరణలూ జరుగుతున్నట్టు పటేలుకు వర్తమానాలొచ్చినై.

పటేలు పిలనీ వెళ్లగానే ఆయా ప్రాంతాల పోలీసు అధికారులను సమావేశపరచి ఈ బందిపోటు దళాన్ని సట్టడానికి తగిన యేర్పాట్లు చేయించారు. పోలీసువారు వీరిని పట్టుకోవటానికి తగిన యేర్పాట్లు చేశారు. అతని సహచరులు చాలామంది పట్టుబడ్డా భూరాఖాన్ మాత్రం చాలా పర్యాయములు తప్పించుకుంటూ వచ్చాడు. చిట్టచివరకు ఇతణ్ణి పోలీసువారు, బికనీరులో ముట్టడించారు. ఇతనితో వున్న మూకొక బందిపోటు దొంగను పోలీసువారు కాల్చివేశారు. భూరాఖాన్‌మాత్రము తీవ్రగాయాలై పోలీసు వారికి చిక్కిపోయాడు.

బన్వారీమాత్రం యింకా పరారీలోనే వున్నాడు కాని యెంతో కాలం దాక్కోలేడు.

పిలనీనుంచి తిరిగి వచ్చేటప్పుడు, పటేలు మరో పోలీసు అధికారుల సమావేశాన్ని ఏర్పాటుచేసి తగిన బందోబస్తులు చేసివచ్చారు.

## విదేశీ రాయబారులకు గవర్నరు జనరలు విందు

న్యూఢిల్లీ, డిసెంబరు 11 : ప్రభుత్వ భవనమునందలి 'మొగల్ గార్డెన్సు'లో గవర్నరు జనరలు శ్రీ సి. రాజగోపాలాచారిగారు విదేశీయ రాయబారులకును, వారి సిబ్బందికిని విందు చేసిరి. అతిథులందరు సమావేశమైన తరువాత గవర్నరు జనరలువచ్చి ఆరామద్వారమువద్ద వారికి స్వాగత మొసంగిరి. గవర్నరు జనరలు అంగరక్షకులు మనోహరమైన ఉడుపులు ధరించి ద్వారమున కిరుప్రక్కల బారులు దీర్చియుండిరి. భారతదేశమునందు రాయబారవర్గముల చేర్పుకొన్న విదేశముల పతాకాలు భవనముపై ఎగురవేయబడి యుండెను. ప్రధాని పండిత నెహ్రూగారును, పై దేశశాఖ అధికారులును విందులో పాల్గొనిరి.

## ఆంధ్రరాష్ట్రనిర్మాణం: ప్రభుత్వ సన్నాహాలు

(1-వ పేజీ తరువాయి)

టకు భవనములు ఉన్నదీ తెలుపవలసినదిగా హైకోర్టు రిజిస్ట్రారుకు మద్రాసు ప్రభుత్వమువారు లేఖ వ్రాసినట్లు తెలియుచున్నది. ప్రస్తుతము పెండింగు దావాల సంఖ్య, సిబ్బందిలో ఆంధ్రుల సంఖ్య హైకోర్టు అధికారులు సేకరించుచున్నారు.

హైకోర్టులో పెండింగులో ఉన్న దావాలలో 100 కి 50 నంబర్లు తెలుగు దేశమునుండే ఉన్నవని హైకోర్టు అధికారవర్గములలో విచారింపగా తెలియుచున్నది.

ఆంధ్ర, తమిళ రాష్ట్రముల ఆస్తి అప్పులను నిర్ణయించటానికి రేపు అక్కౌంటెంట్ జనరల్‌ను ప్రభుత్వ కార్యదర్శులు కలియుచున్నారు. ఆస్తి అప్పులను పరిశీలించుటకు విభజన సంఘంవారు ఒక ఉపసంఘమును నిర్ణయించినారు. డిసెంబరు 21వ తేదీకి వారి నివేదికలు తయారు కాగలవని తెలుపుచున్నారు.

# ఆస్ట్రేలియా నూతన ప్రభుత్వం

## మెంజీస్ అధ్యర్యం

### మంగళవారం నాడు ఏర్పడే సూచన

మెల్బోర్న్, డిసెంబర్ 11: నిన్నటి ఎన్నికలలో కార్మికపక్షాన్ని ఓడించిన లిబరల్ కంట్రీపార్టీ సమ్మేళనకు నాయకుడు రాబర్ట్ మెంజీస్ నేడు పత్రికావిలేఖరుల సమావేశంలో ప్రసంగిస్తూ తమ పక్షం అధికారంలోకి వచ్చినప్పుడు అనుసరించదగిన విధానాన్ని సూచించాడు. కామన్వెల్తు దేశాలమధ్య సన్నిహిత సంబంధాలు, అమెరికాతో సహకారం, దేశానికి యూరపియన్ల వలసను భారీఎత్తులో ఆహ్వానించటం, కంట్రోళ్ళను తొలగించటం అన్నవి వారివిధానంలో కొన్ని ముఖ్యాంశాలు.

రాబర్ట్ మెంజీస్ మంగళవారంనాడు కాన్‌బెరాకు వెళతాడనీ, కొత్తప్రభుత్వం ఏర్పరచమని గవర్నర్ జనరల్ ఆతణ్ణి అహ్వానిస్తాడనీ తెలుస్తున్నది.

ప్రస్తుతప్రధాని చిఫ్లీ రేపు గవర్నర్ జనరల్ చేతికి తన రాజీనామా నందజేస్తాడనికూడా తెలుస్తున్నది.

"ఎన్నికల ఫలితాలు వస్తున్నకొద్దీ లేబర్ ప్రభుత్వానికి చాలా పెద్ద తేడాతోనే అపజయం కలిగినట్లు తెలుస్తున్నది. కొత్త ప్రభుత్వానికి ప్రభుత్వ నిర్వహణకు కావలసిన సంఖ్యాబలం తప్పక వస్తుంది." అని మెంజీస్ నేటి పత్రికావిలేఖరుల గోష్ఠిలో అన్నాడు.

"సమగ్ర కామన్వెల్తు ఆర్థిక సహాయ కార్యాన్ని కదానిని అత్యవసరంగాజరుపవలసి ఉన్నది. ఆస్ట్రేలియాలో ఏర్పడే కొత్త ప్రభుత్వమూ, న్యూజిలాండ్‌లో ఏర్పడే కొత్తప్రధానీ (కన్సర్వేటివ్) ఈ ప్రతిపాదనను సమర్థిస్తారని నాకు నమ్మకం ఉన్నది. బ్రిటిష్ సామ్రాజ్యదేశాలన్నిటి మధ్యనూ సన్నిహిత సంబంధాలుండాలి. కామన్వెల్తుదేశాలమధ్య సన్నిహిత సంబంధాలు అమెరికాతో సహకారం అనేవి మా విదేశాంగవిధానానికి ముఖ్యసూత్రాలు.

ఆస్ట్రేలియా యూరపియన్ల వలసను భారీఎత్తులో ప్రోత్సహించటం చాలా అవసరం." అని అతడు వివరించాడు.

లిబరల్-కంట్రీ పార్టీల సమ్మేళన ఈ ఎన్నికలలో గెలవటానికి మొదటికారణం కంట్రోళ్లపట్ల ప్రజలకు కలిగిన అసంతృప్తి అనీ, రెండవ కారణం రెండుపార్టీల సంపూర్ణ సమైక్యత అనీ మెంజీస్ అభిప్రాయపడ్డాడు.

### లేబర్ ప్రతినిధుల వ్యాఖ్య

లేబర్ ప్రధాని చిఫ్లీ ఎన్నికల ఫలితాన్ని గురించి మాట్లాడుతు "ఇది ప్రజానిర్ణయం. దానిమీద నేనుచేసే ఫిర్యాదేమీ లేదు" అని అన్నాడు.

లేబర్ విదేశాంగ మంత్రి ఇవాట్ మాట్లాడుతూ "స్థానాలను బట్టి చూస్తే లేబర్ పక్షానికి ఎన్నికల ఫలితం విరుద్ధంగానే కనిపిస్తున్నది. కాని న్యూసౌత్ వేల్స్ రాష్ట్రంలో అధిక సంఖ్యాకులైన ప్రజలకు లేబర్ పార్టీ మీదనే విశ్వాసం ఉన్నట్లు తెలుస్తున్నది." అని అన్నాడు.

### ఎన్నికల వివరాలు

ఇప్పుడే చేరిన పరిపూర్ణ సూచనలను బట్టి ప్రజా ప్రతినిధుల సభలోని 123 స్థానాలలోనూ 75 స్థానాలు లిబరల్, కంట్రీ పార్టీల సమ్మేళనకూ, లేబర్ పక్షానికి 44 స్థానాలూ వచ్చినట్లు తెలుస్తున్నది.

సెనేట్ సభ ఎన్నికల లెక్కింపు ఇప్పుడే ప్రారంభమయింది. జనాభా వారీ ప్రాతినిధ్య సూత్రాన్ని బట్టి సెనేట్‌లో లేబర్ పార్టీకే సంఖ్యాబలం రావచ్చునని తెలుస్తున్నది.

### ప్రభుత్వ స్థానాల పంపిణీ

ఎన్నికల్లో గెలిచిన లిబరల్, కంట్రీ పార్టీల నాయకులు రాబర్ట్ మెంజీస్, ఫాడెన్‌లు బుధవారం నాడు సమావేశమై నూతన ప్రభుత్వంలో కంట్రీ పార్టీకి ఎన్ని స్థానాలివ్వాలన్న సమస్యమీద చర్చిస్తారు. ఆ పార్టీకి మంత్రివర్గంలో 19 స్థానాలలోనూ 6 స్థానాలు ఇవ్వబడతవని తెలుస్తున్నది. పార్టీ నాయకుడు ఫాడెన్ ఖజానా మంత్రికావచ్చును. మెంజీస్ ప్రధాని కావటం నిశ్చయమయింది.

### ఇండియాపట్ల వైఖరిమారదు

పూనా, డిసెంబరు 11: ఆస్ట్రేలియాలో లేబర్ ప్రభుత్వం పోయి లిబరల్-కంట్రీ సమ్మేళన ప్రభుత్వం ఏర్పడటం వల్ల ఆస్ట్రేలియా ఇండియాపట్ల అనుసరిస్తున్న విధానంలో మార్పేమీ ఉండదని ఆస్ట్రేలియాలో ఇదివరకు భారత హైకమిషనర్‌గా పని చేసిన సర్ రఘునాథపరంజపె గారు నిక్కడ అన్నారు. ఆస్ట్రేలియన్ రాజకీయ పక్షాలన్నీ ఇండియా పట్ల సానుభూతి కలిగి ఉన్నవని ఈయన అన్నాడు.

# బుడమేరు ప్రాజెక్ట్ నిర్మాణావశ్యకత

## ప్రభుత్వానికి విన్నపం

### రాష్ట్రకాంగ్రెసు రాయబార నియామకం

విజయవాడ, డిసెంబరు 11: బుడమేరుకు చంద్రాయి గూడెంవద్ద ప్రాజెక్టును కట్టి, ఇబ్రాహీం పట్నంవద్ద బుడమేటి నీటిని కృష్ణలోనికి జాలుచేయు ఏర్పాటులను సత్వరమే ప్రారంభింప ప్రభుత్వమును కోరుటకు, రాష్ట్రకాంగ్రెసు కార్యవర్గమువారు శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, శ్రీ దుగ్గిరాల బలరామకృష్ణయ్య, శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య, గారలతో కూడిన ఒక రాయబార సంఘమును నియమించినది.

ఈ ప్రాజెక్టుకు ఒక కోటి రూపాయలకు పైగా ఖర్చుకావచ్చును. కాని సంవత్సరమునకు ఒక లక్షటన్నుల ఆహారము దీని క్రింద అదనముగా ఉత్పత్తియగును. పైగా ప్రతిసంవత్సరము వరద ప్రమాదములుండవు. (స్వ. వి.)

### మడకశిర తాలూకాకు మైసూరు విద్యుచ్ఛక్తి

#### మద్రాసు ప్రభుత్వం వద్దకు కాంగ్రెస్ నాయకుల రాయబారం

హిందూపురం, డిసెంబరు 6: మడకశిరా తాలూకా కాంగ్రెసు సంఘ అధ్యక్షులు సి. వి. ఆనంద కృష్ణయ్య, కార్యదర్శి పి. అనంతరావు సభ్యులు ఆర్. కె. నాగేశ్వరరావు, గొ. రామశాస్త్రి, హెచ్. నరసింగరావు, వి. లక్ష్మీనారాయణయ్య గారలు మద్రాసు ప్రభుత్వ పబ్లిక్‌వర్క్సు అభివృద్ధి శాఖామంత్రులను దర్శించి ప్రభుత్వం వెంటనే మైసూరునుండి మడకశిరా తాలూకాకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయుటకు తగు చర్య గైకొనవలెనని కోరుటకు మదరాసు వెళ్ళిరి.

మడకశిరా తాలూకాలో అభివృద్ధి ప్రణాళిక నమలుపరచమని కూడ వారు మంత్రులను ప్రార్థించ వచ్చునని తెలియుచున్నది. (స్వ. వి.)

### నిడదవోలులో వెంకట్రావు గారికి స్వాగతం

నిడదవోలు, డిసెంబరు 10: అఖిల భారత కాంగ్రెసు కార్యదర్శి కళా వెంకటరావు గారు నేటి మధ్యాహ్నం వాల్తేరుపోవు రైలుబండిలో రాజమండ్రి వెళ్లుచున్న సందర్భంలో నిడదవోలు పౌరులు, కాంగ్రెసు సేవకులు ఘనమైన స్వాగతమొసంగిరి. వెంకటరావుగారితో మాగంటి బాపినీడుగారుకూడా వున్నారు.

వెంకట్రావుగారు రైలులో ఆంధ్ర రాష్ట్ర విభజనకు సంబంధించిన కార్యక్రమంలో నిమగ్నులై "మద్రాసు సివిలు లిస్టు"లో తెలుగువుద్యోగుల పేర్లను గుర్తుపెట్టుకొనుచున్నారు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జనవరికా, ఏప్రిలుకా అని అడుగగా విభజన భాగాజరగాలంటే ఏప్రిల్ కే అన్నారు. మీ అందరి అభిప్రాయం ఏలాగుంటే అలాచేస్తామన్నారు. అంతలో బండి కదిలింది. (స్వ. వి)

### 170 తులముల బంగారం పోలీసుల అధీనం

కలకత్తా, డిసెంబరు 11: నేటి మధ్యాహ్నము కస్టమ్సు అధికారులు బాంకాక్ నుండి కలకత్తాకు వచ్చిన ఒక ప్రయాణీకునినుండి 18 వేల రూపాయలు విలువ చేయు 170 తులముల బంగారమును వశపరుచుకొనిరి.

### పోలీసు స్టేషన్‌పై కమ్యూనిస్టుల దాడి

కలకత్తా, డిసెంబరు 11: నేడు చీకటి పడిన తరువాత దాదాపు నూరుమంది కమ్యూనిస్టు నినాదములు గావించుచు చంద్రనగర్ సరిహద్దున హుగ్లీ జిల్లాయందలి ఒక పోలీసు స్టేషనుపై శాంబులతో దాడి చేసి స్టేషనునందలి టెలిఫోను రిసీవర్‌ను, కుర్చీలు బల్లలున్నగువానిని పాడుచేసిరి. డ్యూటీలో నున్న పోలీసులు లాఠీలతో వారిని తరిమిరి. తరువాత ఒకరిపై నొకరు యిటుకరాళ్లు రువ్వుకొనుట జరిగెను. తత్ఫలితముగా ఒక కానిస్టేబులుకు, దాడిచేసిన వారిలో కొందరికి గాయములు తగిలెను.

అరెస్టు తప్పించుకొనుటకుగాను దుండగీండ్రు ఫ్రెంచి భూభాగమును చంద్రనగర్ లోనికి తప్పించుకొని పోయిరి. ఈ సంగతి తెలియగానే హుగ్లీ జిల్లా మేజిస్ట్రేటు, పోలీసు సూపరింటెండెంటు పోలీసు సిబ్బందితో అచ్చటికివెళ్ళి పరిస్థితులను అదుపులోనికి దెచ్చిరి. నేరస్థులను అరెస్టు చేయుటకు తగినచర్యలు గైకొనవలెనని జిల్లా మేజిస్ట్రేటు చంద్రనగర్ పోలీసు అధికారులను కోరెనని తెలియుచున్నది.

ఫిల్ము ప్రదర్శకుల సభ

వ. ఇ. ఫిల్ము ఛేంబరులో ఫిల్ము ప్రదర్శకులకు సభ్యులసభ 14 వ తేదీన మదరాసులో ఉ. 11 గం. జరుగును.

# రైతులనుండినిర్బంధఋణముల వసూలు: ప్రభుత్వ వైఖరి విమర్శ

## ఆంధ్రరాష్ట్రకాంగ్రెస్‌కార్యవర్గతీర్మానాలు

### "5 ఎకరాల మాగాణి, 15 ఎకరాల మెట్టకు లోపున ఉన్న రైతులను మినహాయించాలి"

విజయవాడ, డిసెంబరు 12: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గం అధ్యక్షుడు ఆచార్యరంగాగారి అధ్యక్షతను సమావేశమై ఆహార పదార్థముల ధరలు, రైతులనుండి నిర్బంధముగా ఋణములు వసూలుచేయుట కాంగ్రెస్‌లో సభ్యులను చేర్చుట మున్నగు విషయములను చర్చించి తీర్మానములను చేసెను. ఆంధ్రరాష్ట్ర నిర్మాణ ఉత్తరువు జనవరి 25 లోపుగా జారీ అవడానికి అవసరమైన సమస్త ఏర్పాట్లు చేయవలసిందని మద్రాసు ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానం చేసెను. (ఇది విడిగా ప్రకటించబడినది.) రంగాగారు తిరిగి నిన్నరాత్రి ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీ వెళ్లినారు.

### కాంగ్రెసులో సభ్యులను చేర్చుట

ఖద్దరు ధారణ, కాంగ్రెసు పై అభిమానము, క్రమశిక్షణ పై గౌరవము, వ్యతిరేకులతో చేరకుండుట, ఏదియో యొక కాంగ్రెసు కృషిలో పాల్గొనుట—వీటిలో ఏ ఒక్క యోగ్యతను గూడా చూడకుండగా, ఎట్టి విచక్షణ చూపకుండగా, అనేక చోటులందు కాంగ్రెసు వారిచే సభ్యులు చేర్పించబడు చున్నారని, కార్యవర్గము వారికి అనేక ఆరోపణలు వచ్చుచున్నవి. సభ్యులను చేర్పించుటలో కాంగ్రెసువారు చాలా నియమబద్ధముగా ప్రవర్తింపవలెనని కార్యవర్గము వారు హెచ్చరించుచున్నారు.

### రైతులకు నిర్బంధ దాపరిక విధానము

కేంద్ర శాసన సభ కాంగ్రెసు పక్షము నియమించిన ప్రత్యేక సంఘము వారు చేసిన సిఫారసు ప్రకారము మద్రాసు ప్రభుత్వము రైతులందరి వద్ద నుంచి - నిర్బంధముగా రైతువేర దాచినట్లుగా - ధనమును పెద్ద చిన్న అను తారతమ్యము లేకుండగా రైతులందరివద్దనుండి వసూలు చేయ నిశ్చయించుట ఆశ్చర్యకరముగా నున్నది. ఆర్థికమాంద్యమేర్పడినదని, తత్ఫలితముగా గ్రామ ప్రాంతములలో అప్పు పుట్టుట లేదని ప్రభుత్వము గ్రహించి, రూ 50 కి లోపు శిస్తునిచ్చు లంక రైతుల వద్ద నుంచి, రూ 15 కి లోపు శిస్తునిచ్చు మెట్టరైతుల నుంచి, లేక 5 ఎకరములలోపు మాగాణి కలరైతులనుంచి, 15ఎకరములలోపు మెట్టగల వారినద్దనుంచి, ఈ నిర్బంధమైనవసూళ్లను చేయకుండా ఉండవలెనని ప్రభుత్వమును కోరుచున్నాము. వరద, తుపాను చే బాధలు పడిన రైతుల వద్దనుంచి, ఇట్టి వసూలును చేయరని ఆశించుచున్నాము.

### ఆహార పదార్థముల ధరలు

ఇతర వస్తువుల ధరలను తగ్గించ కుండగనే, ఈ ఆర్థిక మాంద్యపు కాలములో, ఆహార పదార్థముల ధరలను ప్రభుత్వము నాటికి పరిపరివిధముల తగ్గింపబూనుట విచారకరముగ నున్నది. అధమము సేకరణ చేయువారు, కంట్రోల్డు ధరలకైనను ధాన్యమును కొనునట్టు కట్టుదిట్టము చేయవలెనని ప్రభుత్వమును కోరుచున్నాము.

### క్రమశిక్షణచర్యా సంఘము

క్రమశిక్షణచర్యా సంఘములోనికి శ్రీయుతులు విశ్వేశ్వరరావు, పప్పూరి రామాచారి గారలను తీసికొనుచూ, సత్వరమే రాయలసీమజిల్లాలలోనికి కూడా ఈ సంఘము లోని కొందరు సభ్యులంపోయి, విచారణలు సాగింపకోరుచూ, తీర్మానించుటమైనది.

### తుపాను బాధితులకు సహాయము

తుపాను బాధితుల సహాయార్థమై నిరాళము లోసరి మార్గదర్శకులైన గవర్నర్ జనరల్ గారికి, ప్రధానమంత్రి నెహ్రూపండితునికి, కాంగ్రెసు కార్యవర్గమువారికి అధికారులకు తదితరులకు ఈ కార్యవర్గమువారు రధన దించుచు, ఈ క్రింది సహాయములను చేయవలసినదిగా ప్రభుత్వమును కోరుచున్నారు. 1. రెండవపంటకు ఉచితముగా విత్తులను, ఎరువులను ఇవ్వవలెను. 2. శిస్తురెమిషన్లనిచ్చి, తల ఒకరికి రూ 100 తక్కావీ ఋణముల నివ్వవలెను. 3. పేదరైతులవద్దనుండి ధాన్యసేకరణ చేయరాదు. 4 ఉప్పుటేరును లోతుచేసి, బాగుచేయవలెను. 5. బుడమేరుకు చంద్రాయిగూడెం వద్ద ప్రాజక్టును కట్టి, ఇబ్రాహింపట్నంవద్ద బుడమేటి నీటిని కృష్ణానదిలోనికి మరల్చు ఏర్పాటును చేయవలెను. 6. బెస్తవారికి ఋణములను, ధనసహాయమును ఇవ్వవలెను. 7. కాలువ దార్లకు రక్షణ నివ్వవలెను.

### కాంగ్రెసు సభ్యత్వపు ఫారములు

తాలూకా, జిల్లా, రాష్ట్ర సంఘములకు ఫారములను అందజేయవలసిన చివరిదినము.

19-12-49:—రాష్ట్రసంఘపు ఆఫీసుకు చేర్చిన సభ్యుల సంఖ్యను టెలిగ్రాం ద్వారా తెలియజేయవలసిన దినము.

22-12-49:—సభ్యత్వపు ధనమును పంపవలసిన చివరిదినము.

డిసెంబర్ 29నాడు మహానందిలో (కర్నూల్ జిల్లా) కార్యవర్గ సమావేశము జరుప నిర్ణయింపబడెను.

శ్రీరంగా, నేటిరాత్రి గ్రాండ్ ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీకి వెళ్ళిపోయిరి.

### ఖర్గపురంలో తెలుగు విద్యాపీఠం

ఖర్గపురం, డిసెంబర్ 7: మొన్న ఉదయం యిక్కడ తెలుగు విద్యాపీఠము యొక్క ప్రస్తుతమున్న భవనమును మార్చి రెండు అంతస్తుల మేడ కట్టుటకుగాను, కలకత్తా వాస్తవ్యులును, సుప్రసిద్ధ వర్తక శిఖామణులగు వి. సూర్యనారాయణ శ్రేష్ఠిగారిచే శంకుస్థాపన జరుపబడెను. ఖర్గపుర ఆంధ్రులు చాలామంది సంకుస్థాపనోత్సవమునందు పాల్గొనిరి. భవన నిర్మాణమునకుగాను 3184 రు. విరాళం యిప్పటి వరకు వసూలు కావటం ఉత్సాహకరముగ నున్నదని ఆర్. వి. శర్మగారు అనిరి.

### శ్రీరంగనాధ స్వామి విగ్రహ ప్రతిష్ఠ

నర్సారావుపేట, డిసెంబరు 7:— స్థానిక కాఫీ హోటల్ యజమానులలో నొకరగు సోమంచి బ్రహ్మయ్యగారు యిక్కడ ఆరండల్‌పేట యందొక ఆలయమును నిర్మింపజేసి అందు యీ వారమున శ్రీరంగనాధస్వామి విగ్రహమును ప్రతిష్ఠింప జేశారు. ఈ సందర్భమున బ్రాహ్మణ సమారాధన మొదలగునవి జరుపబడెను. (స్వ. వి.)

### నెలాఖరున జగ్జీవన్‌రాం మద్రాసుకు రాక

మద్రాసు, డిసెంబర్ 11: భారత ప్రభుత్వపు కార్మిక మంత్రి జగజీవనరాం ఈ నెల 30 న మద్రాసుకు రాగలరని తెలుస్తున్నది. డిసెంబరు 25 న ఢిల్లీ నుండి బయలుదేరి మైసూరు వెళ్లి అక్కడ నుండి 30 తారీకున విశాఖపట్నం వెళ్లి నౌకా నిర్మాణ శాలను దర్శించి బహిరంగ సభలో ఉపన్యసిస్తారు. మర్నాడు మద్రాసు వచ్చి జనవరి 2 వరకూ ఇక్కడ వుండి, మళ్ళీ మైసూరు వెళ్లి అంతర్జాతీయ కార్మిక సంఘ కార్యవర్గ సభలో పాల్గొంటారు.

మద్రాసు రివిన్యూ, కార్మిక మంత్రి హెచ్. సీతారామరెడ్డిగారు డిసెంబరు 25 న మైసూరువెళ్లి అతరువాత జగజీవనరాం వెంటనేవుండి ఈ పర్యటనలో చివరి వరకూ పాల్గొంటారు.

### నాట్యకళోద్ధరణ సంఘం

మదరాసు, డిసెంబరు 10: నాట్యకళోద్ధరణసంఘము డిసెంబరు 15 న మదరాసులో బయలుదేరి ఆంధ్రజిల్లాలలో పర్యటించెదరు. గుంటకల్‌లో డిసెంబరు 16, బళ్లారి 17, కడప 18, తిరుపతిలో 19 న సమావేశములు జరిపి తిరిగి 21 తేదికి మదరాసు చేరెదరు.

### విడుదల

ఒకమూడు కమ్యూనిస్టు చర్యలలో పాల్గొనమని ప్రోత్సహించినందుకు కొంతకాలము నెంకటప్పయ్య, గంధి వీరయ్య మాచవారి బసవయ్య అను కృష్ణాజిల్లా డిటిన్యూలను ప్రభుత్వంవారు విడుదలచేసిరి. వేణుగంట నారాయణగారిని కూడ విడుదల చేసిరి.

కార్మికజీవిత వ్యయం

డిసెంబరు 3 వ తేదీన అంతమయ్యేవారమునందు మదరాసు నగరంలో కార్మిక జీవితవ్యయం సూచనసంఖ్య 328. మిరపకాయలు చింతపండు గనియాల ధరలు పెరిగి నందున ఒక పాయింటు హెచ్చినది.

# హిందూస్మృతి బిల్లు

## చర్చవాయిదాకు కాంగ్రెస్ లెజిస్లేటివ్‌పార్టీ అసమ్మతి

న్యూఢిల్లీ, డిసెంబరు 11: ప్రస్తుత అధివేశనపార్లమెంటు సమావేశంలో చర్చించబడే అన్ని అంశాలలోకీ అతి వివాదగ్రస్తమైన హిందూస్మృతిబిల్లు రేపు చర్చకు రానున్నది.

ఈ బిల్లుపై చర్చను వాయిదా వేయడానికై నేటిసాయంకాలం జరిగిన కాంగ్రెసు లెజిస్లేటివుపార్టీ సమావేశంలో చేయబడిన ప్రయత్నం విఫలమైనదట.

ఈ బిల్లుపరించి చర్చించడానికి పై సమావేశం జరిగినప్పుడు పండిట్ నెహ్రూ, తాను పార్లమెంటు మొదటి సమావేశం నాడు చేసిన సూచన తిరిగిచేస్తూ, ఈబిల్లు రెండవ ప్రతిపాదనయొక్క మొదటి ఘట్టం ఆమోదించబడాలనీ, వివిధ వర్గాలలోగల వ్యత్యాసాలు సరిచేసి అందరికీబిల్లు సామ్యమైనంత ఆమోదకరంగావుండేలాగు చూడడానికిగాను అనధికారసంఘాన్ని నియమించాలనీ అన్నారట.

అటువంటి సంఘం సమావేశమై తన శిఫార్సులను తెలియజేసేవరకూ ఈ బిల్లు పై చర్చ వాయిదా వడాలని బిలుకు వ్యతిరేకులు కొందరు చేసిన సూచనకు లెజిస్లేటివ్ పార్టీవారు ఆమోదించలేదట.

రెండవ ప్రతిపాదనయొక్క మొదటి ఘట్టం ప్రస్తుత పార్లమెంటు సమావేశంలో ముగించి, క్లాజువారీ చర్చ పైసమావేశంలో జరపవలసిందనీ, ఈ లోపుగా ప్రధాని సూచించిన అనధికార సంఘం వారు కలిసికొని విభేదాలు సరిచేయవచ్చుననీ బిల్లుకు సుముఖులైన సభ్యులూ, స్త్రీ సభ్యులూ సూచించారట.

రేపు పార్లమెంటు సమావేశంలో పండిట్ ముకుట బిహారీలాలు భార్గవా తన ప్రసంగం సాగిస్తారు. కిందటి పార్లమెంటు సమావేశంలో ఈయన ప్రసంగం పూర్తికాలేదు. చర్చ రెండు రోజులపాటు సాగుతుంది. క్లాజువారీ చర్చ పైసమావేశానికి నిలిపి ఉంచబడుతుంది. రెండవ ప్రతిపాదనయొక్క మొదటి ఘట్టానికి సంబంధించిన చర్చ ఈ సమావేశంలో పూర్తి అయేదీ కానిదీ తెలియదు.

ఈ బిల్లుపై సెలెక్టుకమిటీవారు సమర్పించిన నివేదికను డా. అంబేద్కరు ఈయేడు పార్లమెంటు బడ్జెటుసమావేశంలో ప్రవేశపెట్టగా దానిపై 6 రోజులు చర్చ సాగింది. అయితే ప్రసంగాలుచేసినవారు కొద్దిమందే. ప. బెంగాలు ముస్లిము సభ్యుడైన నాజిరుద్దీన్ అహమ్మదు ఒక్కడే బిల్లుకు వ్యతిరేకంగా ఏడుగంటలసేపు ప్రసంగించాడు. ఇందుకనే ప్రధాని నెహ్రూ ఈ పార్లమెంటు సమావేశం మొదటిరోజున మాట్లాడుతూ, దీర్ఘోపన్యాసాలు చేయడం చట్టబద్ధమే అయినాపార్లమెంటు ప్రతిష్ఠను పెంపొందించదన్నారు. ప్రభుత్వం ఈ బిల్లుతోపాటు నిలవడమో, పడిపోవడమో జరగాలని అనుకొనఅన్నారు. అయితే ఈ బిల్లును విశాలదృష్టిలో చూడాలనికూడా అన్నారు.

## ఢిల్లీలో అసమ్మతి: ప్రదర్శనపై లాఠీఛార్జి

### పోలీసు ఉద్యోగులకు ప్రధాని నెహ్రూ హితవు

న్యూఢిల్లీ, డిసెంబరు 12: నేడు పార్లమెంటులో హిందూ స్మృతి బిల్లు పై చర్చ జరగనుండడంచేత కౌన్సిలు భవనం ముందు ఉదయం నుంచీ అనేక మంది స్త్రీలూ, పురుషులూ చేరి బిల్లుకు విరుద్ధంగానూ నెహ్రూ ప్రభుత్వానికి విరుద్ధంగానూ నినాదాలు చేయసాగారు.

ఇట్టి ప్రదర్శనాలు జరుగుతవని ఊహించి పోలీసు వారు లోపలికి అనుమానాస్పదులను పోనివ్వకుండా గట్టి బందోబస్తు చేశారు, అన్ని వాకిళ్ల వద్దా సాయుధ పోలీసులూ, అశ్వపోలీసు దళాలూ ఉంచారు.

11 గంటలకు ముందుగా కొందరు ప్రదర్శనదార్లు ఆకస్మికంగా పోలీసుల మధ్య నుంచి దూసుకొని దక్షిణపు వాకిలి గుండా లోపల ప్రవేశించగా పోలీసులు లేలికగా లాటీ చార్జి చేశారు, కొద్దిమందికి స్వల్పంగా గాయాలు తగిలినవి. ఈ అవకాశం చూసుకొని సుమారు 100 మంది స్త్రీలు లోపల ప్రవేశించారు. పోలీసులు ప్రదర్శనదార్ల నాయకులను 15 మందిని పట్టుకొని వాహనాలలో ఎక్కించారు.

స్త్రీలను నిరోధించడానికి ఆడపోలీసులు కూడా రప్పించబడ్డారు.

పండిట్ నెహ్రూ కౌన్సిలు భవనానికి వచ్చేసమయంలో కొందరు ప్రదర్శనదార్లు ఆయనతో లాటీచార్జి విషయంచెప్పగా లాటీచార్జి చేయవద్దని ఆయనపోలీసులతో చెప్పారు.

కౌన్సిలు భవనంలోపల గాలరిలన్నీ ప్రేక్షకులతో కిక్కిరిసి పోయినవి. వారిలో స్త్రీలు ప్రముఖంగా ఉన్నారు.

కౌన్సిలు భవనం ముందు దాదాపు ఒక గంటసేపు ప్రదర్శనాలు జరిగిన అనంతరం అనేకమంది ప్రదర్శనదార్లు, ముఖ్యంగా భవనం ఆవరణలో ప్రవేశించిన స్త్రీలు, శ్రీమతి శ్రద్ధామాత కొంతసేపు బతిమాలిన మీదట వెళ్లిపోయినారు.

వాకిళ్ళ వెలుపల ఉండే ప్రదర్శకులను తిరిగి పొమ్మని పండిట్ గోవింద మాలవీయ ఈ విషయంగానే కోరగా-వారు వినిపించుకోక ఆయనను రాజీనామాఇచ్చి బయటికి వచ్చి తమతో చేరమన్నారు.

ప్రశ్నల అనంతరం హిందూ స్మృతి బిల్లుపై పార్లమెంటులో చర్చలు ఆరంభమైన తరువాత కూడా బయట ప్రదర్శనాలు జరుగుతూనే ఉన్నవి. అనేక సభ్యులు ఈ ప్రదర్శనాలను చూసినప్పటికీ సమావేశంలో వీటిని గురించి ఎవరూ ప్రసంగించలేదు.

# "1935 చట్టం కిందనే ఆంధ్రరాష్ట్రం ఏర్పడాలి"

## జనవరి 25 లోగా వివిధాంశాలపై స్థూల విభజన అవసరమని రాష్ట్రకాంగ్రెస్ కార్యవర్గ తీర్మానం

విజయవాడ, డిసెంబర్ 11: ఆంధ్రరాష్ట్ర విభజన సందర్భములో, సత్వర పరిష్కారానుకూలముగలేని సమస్యలను ప్రస్తుతము ఆపివేసి, జనవరి 25 లోపల స్థూలాంశములనైనను విభజించి రాష్ట్ర నిర్మాణమునకు 1935 భారతప్రభుత్వ చట్టముక్రింద అవకాశ మేర్పరుచవలెనని చెన్నరాష్ట్రప్రభుత్వమును కోరుచూ నేడు ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గము ఆచార్యరంగా అధ్యక్షతక్రింద సమావేశమై తీర్మానించినది.

సమావేశమునకు 20 మంది కార్యవర్గ సభ్యులలో ఈ క్రిందవారు హాజరయిరి. శ్రీయుతులు ఓబులరెడ్డి, దుగ్గిరాల బలరామకృష్ణయ్య, బులుసు విశ్వేశ్వరరావు, జి. రామచంద్రరాజు, డి. మునిరత్నం నాయుడు, మల్లిపూడి పళ్ళంరాజు, కె. పున్నయ్య. ఈ సమావేశములో కార్యవర్గంవారు అనేక విషయములపై తీర్మానములను చేసిరి. మొదటితీర్మానము - సత్వరాంధ్ర నిర్మాణమునకు సంబంధించినది- ఈవిధంగా ఉన్నది.

### ఆంధ్రరాష్ట్రము

భారత ప్రభుత్వమువారు పంపిన ఆదేశముల కనుగుణముగా అన్ని అంశములపైనను, విభజనసంఘములోని ఆంధ్ర తమిళ ప్రతినిధుల మధ్య ఒడంబడిక కుదురుటకై చెన్నరాష్ట్ర ప్రభుత్వము సునిశ్చితకృషిని చేయవలెనని ఈకార్యవర్గమువారు కోరుచున్నారు. రాష్ట్రముల పట్టికలో, ఆంధ్ర రాష్ట్రమును చేర్చవలెనని పరిషదధ్యక్షుని కోరుటకు వీలుగా, 25 జనవరి 1950 లోగా, విభజనకలాపమును పూర్తి చేయు ఏర్పాటులనురాష్ట్రప్రభుత్వముచేయవలెను

సత్వర పరిష్కారమున కనుకూలముకాని సమస్యలను ప్రస్తుతమునకు నిల్పివేసి, లాంఛనముగానైనను, చెన్నరాష్ట్రమును జనవరి 25 లోగా విభజించుట అవశ్యమని, లేకున్న కాన్‌స్టిట్యూషన్ యాక్టులోని 3 వ సెక్షన్ ప్రకారము చాలా చిక్కు తటంగమంతయు జరుగవలసి యుండుననియు, కార్యవర్గము వారు అభిప్రాయ పడుచున్నారు.

జనవరి 25 లోపల చెన్నరాష్ట్ర ప్రభుత్వము ఈ విభజన కార్యక్రమమునంతయు, భారత ప్రభుత్వ భావముల కనుగుణముగనే, ముగింపు చేయుటకు అవసరమైన ఏర్పాటులను భారత ప్రభుత్వము చేయవలెను అని కార్యవర్గము వారు కోరుచున్నారు.

### బెంగుళూర్ నగర్‌లో పతాక దినోత్సవము

బెంగుళూర్‌నగర్, డిసెంబర్ 9: స్థానిక ఆంధ్ర బాల భారతి సంఘమువారి ఆశ్రయమున మొన్నరాత్రి జాతీయపతాక దినోత్సవము వైభవముగా జరుపబడెను. విద్యాశాలల బాల బాలికలు దైవప్రార్థనలు పల్కిరి.

జాతీయపతాక ప్రాశస్త్యమును గురించి పి. హెచ్. జగదీశచంద్ర రాయలు, వింజమూరి సుదర్శనం పంతులు, ఎం. వి. గుప్త, టి. విజయరాఘవరెడ్డి, జనాబ్ అమీర్ బేగ్, జాకరయ్యపాలు, మున్నగువారు ఉపన్యసించారు.

### విషంకలిసిన కల్లుత్రాగి ఒకని మరణం

మంగళగిరి, డిసెంబరు 8: ఈ సమీప మునగల నవులూరు గ్రామములో కల్లుత్రాగి ఒకమనిషి చనిపోయెను. మరిఒకడు చాలా ప్రమాదస్థితిలోవుండగా స్థానిక ఆస్పత్రికి తీసుకొనివచ్చి ప్రమాదం హెచ్చుటవల్ల గుంటూరు ప్రభుత్వాస్పత్రికి పంపిరి. ఇందునుగూర్చి విచారించగా ప్రతిరోజు వారు దొంగతనముగా కల్లు త్రాగుచున్నట్లును, ఆరోజు కల్లులో విషముకలిసినట్లు, ఆ కల్లు త్రాగినందున ఇలా జరిగినదని తెలిసినది. మంగళగిరి పోలీసువారు కేసును దర్యాప్తు చేయుచున్నారు. (స్వ. వి)

# రైల్వే పనివారి యోగక్షేమములు

న్యూఢిల్లీ, డిసెంబరు 11: భా. జా. ట్రే. యూ. కాంగ్రెస్ అధ్యక్షుడు శ్రీ ఖండూభాయ్ దేశాయిగారును, భా. జా. రైల్వేపనివారి సమితి అధ్యక్షుడు శ్రీ హరిహరనాథ శాస్త్రిగారును నేడు రైల్వేశాఖ మంత్రి శ్రీ గోపాలస్వామిఅయ్యంగారును సహాయమంత్రి శ్రీ సంతానంగారిని కలిసికొని మాట్లాడిరి.

రైల్వేపనివారి యోగక్షేమములకు సంబంధించిన విషయములపై భా. జా. రైల్వే పనివారి సమితితో సమాలోచనలు, ఉత్తర ప్రత్యుత్తరములు, చర్చజరుపుటకు సౌకర్యములు కలుగజేతు రైల్వేశాఖమంత్రులు అంగీకరించిరని భా. జా. ట్రే. యూ. కాంగ్రెస్ కార్యదర్శి తెలిపెను. రైల్వేలను పునర్వర్గీకరించు పథకమునకు తుదిరూపమొసంగి, దానిని అమలుచేయులోపుగా యట్టి పునర్వర్గీకరణమువల్ల తమకు కలుగు లాభనష్టముల విషయమై విజ్ఞప్తి గావించు అవకాశము రైల్వేపనివారికి కొసంగబడుననిగూడా మంత్రులు వాగ్దానము చేసిరని ఆయన చెప్పెను.

### పేకమిషన్ నివేదిక సవరణ: సలహాసంఘ నివేదిక

న్యూఢిల్లీ, డిసెంబరు 11: రైల్వేల విషయంలో సెంట్రల్ పేకమిషన్ రిపోర్టులో తోచిన లోపాలను విచారించి సరియైన సిఫార్సులను చేయవలసిందిగా కోరుతూ ప్రభుత్వం ఏర్పాటుచేసిన సంయుక్త సలహాసంఘంవారు తమ పని పూర్తిచేశారు.

పేకమిషన్ రిపోర్టులో దాదాపు 29 లోపాలు వున్నట్లు ప్రభుత్వానికి వివిధ వ్యక్తులు విన్నవించాయి. అందుమీద ప్రభుత్వం ఈ కమిటీని వేసింది. ఇందులో కార్మికుల ప్రతినిధులు, రైల్వే యజమానులుగూడా సభ్యులుగా వున్నారు.

ప్రభుత్వం వీరి సిఫార్సులను బాగా పరిశీలించి, అందులో 5 అంశాలను వెంటనే అమలు జరుపవలసిందిగా కోరుతూ ఉత్తర్వులు జారీచేసింది. అవి:

(1) రైల్వేలో 55-130 జీతంమీద వున్న మొత్తం గుమాస్తాల సంఖ్యలో 75% మించివుండరాదని ఈ సంఘం సిఫార్సు చేసింది. ప్రభుత్వం ఇందుకు ఆమోదించి ఉత్తర్వులు జారీ చేసింది. ఇందువల్ల కొత్తగా ఇంకో 230 మంది ఉద్యోగాలు ఇవ్వవలసి వుంటుంది. ఇందుకుగాను ఖర్చు 10 లక్షలదాకా అవుతుంది.

(2) ఇంజనీరింగు డిపార్టుమెంటులో కీలక స్థానాలలో వున్నవారికి 30 - 50 స్కేలును ఇప్పించవలసిందిగా సలహాసంఘం సిఫార్సు. ప్రభుత్వం దీన్ని ఆమోదించింది. ఉత్తర్వులు జారీచేసింది.

(3) 80-160 జీతంమీద పనిచేసే టైపిస్టుల అతిరిక్తవర్గేడు ఉద్యోగుల మొత్తంలో 16 20% మించి వుండరాదని పై సంఘం సూచించింది. ఈ 4% తేడాను పరిపాలనా సౌలభ్యాన్ని పురస్కరించుకొని ఏర్పాటు చేసినట్లుకూడా సలహాసంఘం పేర్కొన్నది. ప్రభుత్వం ఈ సూచనను ఆమోదించి ఉత్తర్వులు జారీ చేసింది.

(4) సెంట్రల్ పేకమిషన్ రిపోర్టు రాకముందు కొందరు దినసరి భత్యదలం ప్రభుత్వం ఉద్యోగాల్లోకి తీసుకుంది. ఈ ఉద్యోగాలకు పట్టన గ్రుకే దరఖాస్తులు పెట్టుకోవాలనికూడా ప్రభుత్వం ప్రకటించింది. అట్టివారికికూడా 80-220 స్కేలు మీదే జీతం ఏర్పాటు చేయాలని ఈ కమిటీ సూచించింది. అందుకు ఆమోదించి ప్రభుత్వం ఉత్తర్వులు జారీచేసింది.

(5) స్టెనోగ్రాఫర్ల నియామకంలో గూడా, వారిసంఖ్య అతి తక్కువతరగతి గుమాస్తాల మొత్తంలో 16-2½% మించి వుండరాదని ఈ సంఘం సిఫార్సు. ప్రభుత్వం వీరి సూచనను ఆమోదించడం, ఉత్తర్వులు జారీచేయడం జరిగింది.

# "త్వరలో రానున్న పంచాయతీబిల్లు ద్వారా ప్రజలకు సర్వసౌకర్యాలు సమకూరగలవు"

## తెనాలి పౌరసన్మానసభలో మంత్రి చంద్రమౌళి గారి ఉపన్యాసం: తాలూకాపర్యటన వివరాలు

తెనాలి, డిశంబరు 9: నిన్న ఉదయం మెయిలులో మదరాసునుండి స్థానిక స్వపరిపాలనశాఖామంత్రి కల్లూరి చంద్రమౌళి గారు వెలివోలు సీతారామయ్య, మంతెన వెంకటరాజు ఎం. ఎల్. ఏ. గార్లతో కలిసి తెనాలి వచ్చారు. రైల్వేస్టేషనువద్ద వారికి జిల్లాకాంగ్రెసు అధ్యక్షులు ఆలపాటి వెంకటరామయ్య, కార్యదర్శి ఆరె పిలారెడ్డి, తెనాలి మునిసిపల్ చైర్మన్ నన్నపనేని వెంకటరావు కమీషనర్ జి. వి. సుబ్బయ్యచౌదరి, స్థానిక ప్రభుత్వోద్యోగులు డిప్యూటికలెక్టరు జి. రామమూర్తి పంతులు తహసీలుదారు జి. వి. చలపతిరావు, య. సత్యనారాయణ, జిల్లాబోర్డు పంచాయితీ ఆఫీసరు జి. నరసింహస్వామి హైలెవెల్ ఇంజనీయరు నరసింహరెడ్డి డిప్యూటీ సూపర్నెంటెంటు వి. బి. వేణుగోపాలుగార్లున్నూ యింకా అనేకమంది స్థానిక కాంగ్రెసు వాదులున్నూ స్వాగతమిచ్చారు. అనంతరం మంత్రిగారు యీ తాలూకా సంగం జాగర్లమూడి గ్రామం వెళ్ళిరి; అచ్చట మంత్రిగారికి గొప్ప సన్మానసభ కాపు యువజన సంఘం వారిచే ఏర్పాటు గావింపబడినది. ప్రథమంలో కాపు యువజన సంఘ కార్యదర్శి పాలడుగు సాంబశివరావుగారి యాజమాన్యాన మంత్రిగారికి వారి పరివారానికి తదితర మిత్రులకు కొత్త వెంకయ్యచౌదరి గారి భవనంలో అల్పాహారవిందు గావింపబడెను. గుంటూరునుండి డా॥ పరుచూరి వీరయ్యచౌదరి, ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులు సీరం సుబ్బారావునాయుడు మునిసిపల్ చైర్మన్ ఉప్పుటూరి పున్నారావు మద్ది సుదర్శనం ఎం. ఎల్. ఏ. పాములపాటి వెంకటకృష్ణయ్యచౌదరి మొదలగు కాంగ్రెసు నాయకులు మంత్రిగారిని కలుసుకొనుటకై జాగర్లమూడి గ్రామం వచ్చిరి.

### కాపు యువజనసంఘ పాఠశాల నూతన భవన శంకుస్థాపన

అల్పాహారానంతరం మంత్రిగారు సపరివారంగా కాపు యువజనసంఘ పాఠశాల శంకుస్థాపన గావించుటకుగాను వెళ్ళిరి. ఆ సందర్భంలో అక్కడ ఒకసభ ఏర్పాటు చెయ్యబడింది. మంతెన వెంకటరాజు ఎం. ఎల్. ఏ. గారు సభ కధ్యక్షత వహించిరి. కాపు యువజన సంఘం తరఫున స్వాగత పత్రములు సమర్పించబడెను. తరువాత స్థానిక కాంగ్రెసు నాయకులు చింతమనేని భానయ్యచౌదరి గారు గ్రామకాంగ్రెసు తరఫున మంత్రి గార్కి స్వాగతపత్రము చదివి సమర్పించారు. తరువాత మంత్రిగారు కాపు యువజన సంఘపాఠశాల నూతన భవనమునకు శంకుస్థాపన గావించి తమకు యిచ్చిన సన్మానపత్రములకు ఈ క్రింది విధంగా సమాధాన మొసంగిరి.

### చంద్రమౌళిగారి ఉపన్యాసము

"దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఇప్పుడు మనం చేయుపనులను చాలా జాగ్రతగా ఆలోచించి చేయాలి. గాంధీ గారు వారి ఆదర్శాలు ఆచరణలో పెట్టి సాధించారు. ఉత్తమసంస్థలు నడిపేవారు సంఘ శ్రేయస్సుకొరకు పనిచేస్తారు గాని స్వార్థంకోసం ఆ ఉత్తమ సంస్థలను వినియోగింపరు. రాను, రాను, కాంగ్రెసులో కొందరు ఆ సంస్థను కల్మషభూయిష్ఠంగా చేయాలని ప్రయత్నిస్తున్నారు. యీ సమయంలో చాలా జాగ్రతపడాలి. మంత్రులు అన్ని ప్రాంతాలకు రాలేరు. వారు ప్రజలను మరిచారని భావించరాదు. ప్రభుత్వం మంచిచేస్తే మంచిగా విమర్శించాలి. లేకపోతే చెడు జేస్తే ఆ చెడును ప్రచురించాలి. ప్రభుత్వం తన శక్తికొలది ప్రజలకు మేలుచెయ్యాలని పనిచేస్తుంది; అయితే ధనంలేక కొన్ని కొన్ని పనులు కొంత ఆలశ్యము కాగలవు. ఇతర ప్రభుత్వాలకంటె మన మదరాసు ప్రభుత్వం ఏమీ వెనుకబడలేదు. ప్రజలు ఓర్పు వహించవలెను. మన దేశంలో చాలినంత తిండి, వస్త్రం, వసతి మొదలగునవి లేక ప్రజలు చాల యిబ్బంది పడుతున్నారు. స్వరాజ్యం వచ్చిం తరువాత అనేక సమస్యలు ఉత్పన్నించినవి. ప్రజలు సహకారం చూపితేనే ప్రభుత్వం వీటిని పరిష్కరించగలదు. పాఠశాల విషయంలో మంత్రిగారు మాట్లాడుతూ "విశాల దృక్పథంతో యీ పాఠశాలను నడపాలని అన్నారు. గాంధిగారి సిద్ధాంతం ప్రకారం సంస్థలో అందరికీ ప్రవేశార్హం ఉండాలి గాని ఒకకులానికే ప్రత్యేకించి ఉండరాదని అన్నారు. గ్రామ పంచాయితీలు త్వరలో రానున్నవనీ, గ్రామాదులలో విరివిగా పంచాయతీలద్వారా పనులు నెరవేరగలవనీ అన్నారు. ఈ పాఠశాలకు ఆ గ్రామవాసులు కొత్త వెంకయ్యచౌదరిగారు 1,116 లు విరాళముగా యిచ్చినందుకు మంత్రిగారు వారి ఔదార్యాన్ని కొనియాడారు. తరువాత కాపు యువజన సంఘం తరఫున శెట్టిపల్లి వెంకటస్వామిగారు మంత్రిగార్కి కృతజ్ఞతాభివందనాల నర్పించి మంత్రిగారి అభిప్రాయం ప్రకారం పాఠశాలకు కాపు శబ్దమును తీసివేయుటకు సమ్మతించితిమని సభాముఖమున తెలియజేసిరి. అనంతరం సభ ముగిసింది.

### సంగం జాగర్లమూడి ఆస్పత్రి రోగుల వసతిగృహ ప్రారంభోత్సవము

తర్వాత మంత్రిగారు సపరివారంగా ఆ గ్రామంలోని ఆసుపత్రిరోగుల వసతిగృహ ప్రారంభోత్సవం చేయుటకు వెళ్ళిరి. ప్రథమంలో మంత్రిగారు ఆసుపత్రిని దర్శించి తరువాత రోగుల వసతిగృహప్రారంభోత్సవం గావించిరి. ఆ సందర్భమున ఏర్పాటుచేయబడిన సభకు గుంటూరు పట్టణకాంగ్రెసు నాయకులు శారదా నికేతన నిర్మాతలు వృద్ధులునగు ఉన్నవ లక్ష్మీనారాయణగారధ్యక్షత వహించిరి. మంత్రి గార్కి ఆరోగ్యసంఘ అధ్యక్షులు జంపాల శ్యామసుందర ప్రసాద్ గారున్నూ, పంచాయతీబోర్డుతరఫున కొత్త బుచ్చయ్య గార్లున్నూ సన్మానపత్రములు సమర్పించిరి. మంత్రిగారు యిట్లు ప్రసంగించిరి. మన రాష్ట్రంలో వైద్యశాలలకు ఇతర ప్రాంతాల వైద్యశాలలకున్నూ కొన్ని భేదాలున్నవి. మందులిచ్చేశాఖ వేరుగను ఆరోగ్య పరిశుభ్రశాఖలు వేరుగను పెట్టి వైద్యశాలలు నడిపించుచున్నారు. అనారోగ్యంలేకపోతే వైద్యశాలలతో పనిలేదు. అందుచే అనారోగ్యం లేకుండా చూచుకోవడం అవుసరం. అందుకనే ఆరోగ్యం వైద్యశాలలు కలిపి రెండునూ ఏకీభవంగా నడపాలన్నారు.

### గుడివాడ పంచాయితీ బోర్డు భవనంలో రాష్ట్రపతి చిత్ర పటావిష్కరణ

తరువాత అల్పాహారానంతరం మంత్రిగారు సంగంజాగర్లమూడినుంచి గుడివాడకు వెళ్ళిరి. గ్రామప్రముఖులు మంత్రిగార్కి స్వాగత మొసంగిరి. పంచాయితీ బోర్డు భవనంలో మంతెన వెంకటరాజుగారి అధ్యక్షతను బహిరంగ సభ జరిగినది. పంచాయితీ బోర్డు గ్రామ కాంగ్రెసు తరఫున మంత్రిగారికి సన్మాన పత్రములు సమర్పించబడెను. మంత్రిగారు రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారి చాయాపటమును ఆవిష్కరించుచూ పట్టాభి సీతారామయ్యగారు మన దేశంలో పుట్టడం మనం గర్వింపదగినదన్నారు. గాంధీ గారి సిద్ధాంతాలకు భాష్యం వ్రాసినప్రతిభాశాలి పట్టాభిగారు. డా॥ రాజేంద్రప్రసాద్, పండిత జవహర్‌లాలు నెహ్రూ డా॥ పట్టాభి సీతారామయ్యగార్లు దేశానికి ఆయువు పట్టువంటివారన్నారు. మనం వారి ఆదేశానుసారం నడచుకోవాలనీ మనకు పట్టాభిసీతారామయ్యగారు ఉన్నతమైన నాయకులనీ అన్నారు. ఆయన గొప్ప మేధావంతులు, సత్యమును మరుగుపరుచు స్వభావము ఆయనలో లేదు. నిర్మొగమాటంగా మాటాడగల ధైర్యశాలి అని ప్రశంసించారు. అనంతరం మంత్రి గార్కి వారి పరివారానికి గ్రామం తరఫున విందు చేశారు.

### తెనాలిలో పౌరసన్మానం

మధ్యాహ్నం 3 గంటలకు మంత్రిగారు సపరివారంగా తెనాలికి వచ్చి మునిసిపల్ రహదారి బంగళాలో కొంతసేపు విశ్రాంతి తీసుకున్నారు. తరువాత సాయంకాలం 3 గం॥లకు తెనాలి పురపాలక సంఘంవారు మంత్రిగార్కి సన్మానం ఏర్పరచారు. మంత్రిగారు పురపాలక సంఘ కార్యాలయానికి రాగానే చైర్మన్ నన్నపనేని వెంకటరావుగారు స్వాగతమిచ్చి తన సహచరులకు పురపాలక సంఘ సభ్యుల నందరిని మంత్రిగారికి పరిచయపరచారు అనంతరం మంత్రిగారికి చైర్మనుగారు సన్మానపత్రం సమర్పిస్తూ త్వరలో రానున్న పంచాయితీ బిల్లుతోపాటు నూతన స్థానిక స్వపరిపాలనా చట్టాన్ని అములులోకి తేవాలనీ, అన్ని రంగాలలో వెలుగుచూపిన తెనాలి పట్టణ ప్రజలు మురుగుతో దోమలతో మలేరియా కలరా మొదలైన అంటు వ్యాధులతో సరియైన రహదారులు గృహవసతులు లేక బాధలు పడుతున్నారన్నారు. డ్రెయినేజీ స్కీమును వెంటనే అములు జరిపించాలని కోరారు. మంత్రిగారు ప్రసంగిస్తూ ప్రజల అభివృద్ధికి బాధ్యతగల మన మందరం కలిసి మెలసి పని చేయాలన్నారు. ప్రజలలో ఒక తెగకు, సంఘానికి కాకుండా అందరి అభివృద్ధికి కృషిచేయాలన్నారు. తెనాలిలో మునుసౌకర్యంకొరకు ప్రయత్నంచేయడం అవుసరమని నాకు తెలుసు. త్వరలో పంచాయతీ బిల్లు రానున్నది. దానికి సంబంధించిన సాంకేతిక బాధకాలు ఎప్పటికప్పుడు చర్చించుటకు ఒక కమిటీ వేసినాము. ఆ కమిటీ తగిన కృషి చేయగలదు. తెనాలికి డ్రెయినేజీస్కీము అలక్ష్యం కావడం నాకు విచారకరంగా వున్నది. కాని యీ విషయంలో నా శక్తికొలది పూర్తిగా ప్రయత్నంచేస్తాను. మీరుకూడ శక్తికొలది పనిచేయవలసి యున్నది మన మందరం ప్రజలచేత ఎన్నుకోబడిన వారమే. ఎన్నికలలో ఒకరు శాశ్వతంగా రారు. మనం ఏ ఏ రాజకీయ పక్షాలకు చెందినప్పటికీ ప్రజల శ్రేయస్సుకు మనం శక్తికొలది కృషి చెయ్యాలి అని మంత్రిగారు అన్నారు. తరువాత మంత్రిగారికి సమావేశానికి వచ్చిన పెద్దలకు ఉపాధ్యక్షులు డా॥ చంద్రమౌళి సత్యనారాయణగారు కృతజ్ఞతాభివందనాల్పించిరి.

అనంతరం మంత్రిగారు సపరివారంగా యీ తాలూకా చుండూరు గ్రామం వెళ్ళిరి. అచ్చట గ్రామప్రముఖులు గాజె నాగభూషణ రెడ్డిగారి నాయకత్వాన మంత్రిగారికి స్వాగతమిచ్చిరి.

అల్పాహారవిందు అనంతరం మంతెన వెంకటరాజు ఎం. ఎల్. ఏ. గారి అధ్యక్షతను బహిరంగసభ జరిగినది, పంచాయతీ బోర్డు తరఫున అధ్యక్షులు కల్లం అప్పిరెడ్డి గారు పౌరుల తరఫున నాగభూషణ రెడ్డి గార్లు మంత్రిగార్కి స్వాగతపత్రములు సమర్పించిరి.

ప్రథమంలో మంతెన వెంకట్రాజు గారు మాట్లాడుతూ, దేశంలో ఆహార కొరత తీర్చటానికి ప్రభుత్వం తనశక్తి కొలదీ ప్రయత్నిస్తున్నదనీ, నూతనంగా ప్రాజెక్టులునిర్మించి వ్యవసాయాన్నభివృద్ధి చెయ్యటానికి పూనుకొన్నదనీ, దీనికి ధనం అవసరమనీ, అందుచే ప్రతిరైతు తాను ఎంతశిస్తు చెల్లిస్తున్నాడో అంతమొత్తమును ప్రభుత్వానికి అప్పయిచ్చినచో దీనితో ప్రభుత్వం వ్యవసాయాభివృద్ధికి అవసరమగు స్కీములను అములు జరుపగలదన్నారు.

### చంద్రమౌళిగారి ఉపన్యాసం

చంద్రమౌళిగారు ఈ క్రిందివిధంగా ఉపన్యసించారు.

ప్రస్తుత పరిస్థితులు మనం అందరం అర్థంచేసుకోవలసి యున్నది. గాంధీగారి నాయకత్వాన సత్యం ధర్మం అహింసల ఆధారంతో మనకు స్వరాజ్యం వచ్చింది గ్రామాలలో చిన్న చిన్న వాటివిషయంలో తగాదాలు పెట్టుకొని కోర్టుల కెక్కడి పాలాయితియుండుట విచారకరము. గ్రామాలలో అనేక చేతిపరిశ్రమలున్నవి. ఆ వృత్తులవారంతా వారి పరిశ్రమలను నిర్వహించి రైతుకందిచ్చేవారు. రైతు ధాన్యంపండించి ఆ వృత్తులవారికి ఆహారం కొరతలేకుండా యిచ్చేవారు. కాని యీనాడు గ్రామజీవితం అంతా తారుమారైనది. పల్లెటూళ్లు బాగుపడాలంటే గాంధిగారి సిద్ధాంతాలను ఆచరణలో పెట్టాలి. స్వరాజ్యం వచ్చింది. దానిని నిలుపుకోవాలంటే గ్రామపునర్నిర్మాణం చేసుకోవాలి. దేశంలో ప్రస్తుతం తిండికి, వస్త్రానికి కొరత ఏర్పడింది. యీ కొరత వస్తువులను దాచి యిట్టి ఆపత్సమయంలోగూడ బ్లాకుమార్కెట్టులో అమ్ముకునేవారున్నారు. యిందువలననే ప్రజలలో భీభత్సం ఏర్పడ్డది. కాంగ్రెసులోగడ చేసిన వాగ్దానాల నన్నిటినీ అన్నివక్కమాటు ఆచరణలో పెట్టలేము. ప్రజలంతా ప్రభుత్వంతో సహకరించాలి. వస్తువులు ఉత్పత్తి యవ్వాలి. స్థానికప్రభుత్వసంస్థల ద్వారా ప్రభుత్వం సహాయం చేస్తుంది. ప్రజలవద్దనుండి వసూలుచేసిన ధనం ప్రభుత్వం ప్రజల సౌకర్యాలకు ఖర్చు చేయగలదు. గ్రామపంచాయతీలు గ్రామ సౌకర్యం కొరకు నిల్వద్రవ్యాన్ని ఖర్చు చేయాలిగాని నిల్వలుంచుకున్నందున ప్రయోజనంలేదు. చిన్నచిన్నరోడ్లు వగైరాలు గ్రామ పంచాయితీలు నిర్వహించాలిగాని ప్రభుత్వం నిర్వహించదు. గ్రామపంచాయతీ బిల్లువల్ల తగాదాలు రాగలవని వ్యతిరేక ప్రచారం చేయువారున్నారు. గాని గ్రామపరిపాలన గ్రామపంచాయతీలే నిర్వహించాలి. అప్పుడే దేశం అభివృద్ధి చెందగలదు. అని మంత్రిగారు అన్నారు. తర్వాత మంత్రిగారు పెదపూడి హైస్కూలుకు తగినద్రవ్యసహాయం చేయాలనియు. సమీపమునన్న విద్యాసంస్థ నిర్వహణలో భాగాస్వాములు కావాలని చుండూరు ప్రజలను హెచ్చరించారు. గాజె నాగభూషణరెడ్డిగారి భవనంలోమంత్రిగారికీ, వారి బృందానికి భోజనవిందు జరిగింది. విందు అనంతరం మంత్రిగారు తెనాలికి వచ్చి రాత్రి ఉండి మరుసటిరోజు ఉదయం వారి స్వగ్రామమగు మోపర్రు వెళ్ళి రాత్రికి తెనాలివచ్చి మెయిలులో మదరాసువెళ్లిరి. (స్వ. వి.)

# తుఫాన్ బాధితులకు సహాయం

## ప్రధాని కుమారస్వామి రాజా విజ్ఞప్తి

మదరాసు, డిశంబరు 10: విశాఖపట్నం, తూర్పు గోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోనూ, నెల్లూరు, కడప, కర్నూలు, బళ్ళారి జిల్లాలలో 1949 సెప్టెంబరులో వరదవలన, తరువాత నెలలో తుఫానువలన విపరీత నష్టము సంభవించిన విషయము అందరికీ తెలిసినదే. మొదటి అయిదు జిల్లాలలో నష్టము తీవ్రముగా యున్నది. వరద, తుఫానులలో 828 మంది ప్రాణములుపోయినవి. 35000 పశువులు వందలకొలది గొర్రెలు, మేకలు పోయినవి. 3 వేల పైచిలుకు ఇళ్లు ఎగిరిపోవుటగాని, చెడిపోవుటగాని జరిగినది. మహనూలు అయిన ఆహారధాన్యములు కొట్టుకుపోయెను. 17,33,000 యకరములలో పంటకు విపరీతముగా నష్టము వాటిల్లెను. కొబ్బరితోటలు బాగా దెబ్బతిన్నవి. రెండు మూడు ఏళ్ల వరకు కాపే వుండదు. అరిటి పసుపు మొదలగువానికి కలిగిన నష్టముకూడ తక్కువ ఏమీ కాదు. డబ్బు విలువలో చూస్తే నష్టము రు 30 కోట్లవరకు వుండవచ్చును, అని మదరాసు ప్రధాని శ్రీ కుమారస్వామిరాజాగారు తుఫాను బాధితుల సహాయనిధికి విజ్ఞప్తిచేయుచు తెలిపిరి.

వారింకనూ ఇట్లు విజ్ఞప్తి చేశిరి: ఇందువలన బీదజనమునకు కలిగినకష్టనష్టములను ఊహించవచ్చును. చాలమంది నిలవ నీడ లేకుండా సర్వస్వమూ కోల్పోయిరి. వారికి ఇళ్లు కట్టుకొనుటకు, వృత్తిని సాగించుకొనుటకు అవసరమగు సహాయముచేయవలసియున్నది. మరల వాళ్ళు కాళ్ళమీదవాళ్లు నిలబడువరకూ సహాయము చేయవలసియున్నది. ఈ దురదృష్టవంతులను నిస్పృహనుంచి తొలగించుటకు సహాయకార్యక్రమము వెంటనే ప్రారంభించవలసియున్నది.

ప్రభుత్వము ఇంతవరకు రు 19, 91000 లు, రాష్ట్రనిధినుండీ, కృష్ణా, గోదావరి తుఫాను సహాయనిధినుండి రు. 35 000 లు తక్షణసహాయమునకు మంజూరు జేయబడినది. నష్టపడిన వ్యవసాయకులు పశువులను, వ్యవసాయపరికరములను కొనుక్కొనుటకు వడ్డీలేని ఋణములు ఇవ్వవలెనని ప్రభుత్వము వుత్తర్వుచేసెను. విత్తనములు, ఎరువులు వీలున్నచోట్ల రెండవపంటకు నీరు సప్లయి చేయుటకు ఏర్పాట్లు జరిగెను.

ఇంకనూ ఈ క్రిందిరకము సహాయం చాల అవసరము.

(1) గృహనిర్మాణ పరికరములు, వస్త్రముల ఉచితసప్లయి (2) పశుగ్రాసము (3) చెడినభూముల మరమ్మత్తు (4) బీదకుటుంబములకు మెరక ఇళ్ళస్థలములను ఇచ్చుట (5) పల్లెవారికి పడవలు, వలలు, కార్మిక తరగతులకు వృత్తి పరికరములు, ఏవరైతులకు వ్యవసాయ పరికరములు ఉచితముగా ఇచ్చుట (6) సంపాదించేయజమానిని కోల్పోయినవారికి మొత్తముగా ధనసహాయము (7) మరల పంటవచ్చేవరకు జీవన ఏర్పాట్లు (8) కోల్పోయిన పశువులను ఇచ్చుట జరుగవలసియున్నది.

ఇంతపెద్ద నష్టమును ప్రభుత్వము ఆదాయమునుండి భర్తీ చేయలేదు. ప్రజల సహాయము అవసరం. వేలసంఖ్యలోవున్న నష్టపడిన కుటుంబము లన్నింటికీ తగినసహాయమిచ్చుట కూడ అసాధ్యము సహాయనిధికి విరాళము లివ్వవలెనని గవర్నరుకూడ విజ్ఞప్తిచేసియుండిరి. 'వర్నరుగారు ఆంధ్ర తుఫాన్ సహాయనిధి" ప్రారంభించిరి. దీనిని రాష్ట్రక్షేమనిధిలో భాగముగా ప్రత్యేక కమిటీద్వారా నిర్వహించెదరు. విరాళములు వసూలుచేయుటకు త్వరలో జిల్లాలలో కమిటీలను ఏర్పరచెదరు. ఈ నిధికి ఉదారముగా విరాళములు ఇవ్వవలెనని మదరాసు ప్రభుత్వము రాష్ట్ర ప్రజలందరికీ విజ్ఞప్తి చేయుచున్నది. ఎంత చిన్న మొత్తమైననూ స్వీకరించెదరు. విరాళములను గవర్నర్సు ఆంధ్రతుఫాన్ సహాయనిధి" ట్రెజరరు శ్రీ కె.యం. రాజరత్నం పేరగాని జిల్లాలలో రాష్ట్రక్షేమనిధి స్థానిక శాఖ ట్రెజరరుపేర గాని పంపవచ్చునని.

## తుఫాన్ బాధితులకు ప్రభుత్వ సహాయం

మదరాసు, డిశంబరు 10: ఇటీవలి తుఫానులో తూర్పుగోదావరిజిల్లా అములాపురం, రాజోలు తాలూకాలు పశ్చిమ గోదావరిజిల్లా నరసాపురం తాలూకాలలో పల్లెవారికి చేపలుపట్టు పరికరముల సప్లయి నిమిత్తం మదరాసు ప్రభుత్వము రు 63,900 లు మంజూరుచేసెను.

విశాఖపట్నం జిల్లాలోని తుఫాను బాధితుల సహాయము నిమిత్తము ప్రభుత్వము అదనముగా రు 75000 లు మంజూరు చేసినది.

## గ్రామాలలో నీటి వసతుల అభివృద్ధి

### రెవెన్యూ ఇన్‌స్పెక్టర్లకు ప్రభుత్వ ఉత్తరువు

పొన్నూరు, డిసెంబరు 9: అధికారిక తీర్మానికగాను, ప్రభుత్వ పంచవర్ష ప్రణాళిక ప్రకారం, గ్రామాలలోని, ప్రస్తుత నీటివసతులను, అదనపునీరు కావలసిన అవుసరములను, జనసంఖ్య, అదనపుబావుల శిఫార్సులనుగూర్చి, విచారణసల్పి, రిపోర్టు పంపవలసినదిగా, పైన రు యిర్రిగేషను పోళక్షియులను, ఆరోగ్యశాఖ యిన్స్పెక్టర్లకు, రెవిన్యూ యిన్స్పెక్టర్లకు, వుత్తర్వులు జారీచేయబడినవి. (స్వ. వి.)

### పట్టణ కమ్యూనిస్టు అరెస్టు

గుడివాడ, డిసెంబరు 7: పట్టణ సబ్ ఇనస్పెక్టరు మస్తాన్‌గారు తమ సిబ్బందితో నిన్నరాత్రి ఎ. నారాయణదాసు ఇంటిమీద దాడిచేసి సుమారు 300 కమ్యూనిష్టు సిద్ధాంతమునకు చెందిన పుస్తకములు, స్వాధీనం చేసుకున్నారు. నారాయణదాసును అరెస్టుచేశారు. ఇనిఒక బియ్యపు బస్తాలో, దాచబడి వున్నవట. స్వ. వి.

### ముచ్చుమిల్లిలో నూతనంగా పోష్టాఫీసు

ముచ్చుమిల్లి, డిసెంబరు 9: రామచంద్రపురం తాలూకా ముచ్చుమిల్లి గ్రామంలో మొన్న, కాకినాడ సబ్ డివిజనలు పోష్టలు ఇనస్పెక్టరుగారైన కూనపులి నరసింహశర్మగారిచే బ్రాంచి పోష్టాఫీసు స్థాపింపబడినది.

### తాటిబెల్లం లైసెన్సుల దురుపయోగం

హిందూపురం, డిసెంబరు 7: గోరంట్ల మద్యనిషేధశాఖ సబ్‌ఇన్స్పెక్టరు జనాబ్ మహమ్మద్ షెరీఫ్‌గారు 6 వ తేదీ సోమవారం చిలమత్తూరు మజీరా పాతసాముల పల్లి అను గ్రామములోని తాటితోపులపై దాడిచేసి 30 గాలన్ల మద్యమును పట్టుకున్నారు. తాటి చెట్లనుండి కల్లుతీసి బెల్లం తయారుచేయుటకు ముగ్గురికి ప్రభుత్వము లైసెన్సులు ఇచ్చినదనీ, నారీ విధముగా లైసెన్సులు దురుపయోగముచేసి, మద్యము తయారుచేసినారని తెలియుచున్నది.

నిందితులను అరెస్టుచేసి మేజస్ట్రేటు థామస్ రెడ్డిగారి యెదుట హాజరు చేయగా, మేజస్ట్రేటుగారు ఒక్కొక్కరికి మూడు మాసముల కఠిన శిక్షను విధించారు. (స్వ. వి.)

### దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారి చిత్రపట ఆవిష్కరణ

గుడివాడ, డిసెంబరు 7: మొన్న సాయంత్రం కైకలూరు తాలూకా కాంగ్రెసు కార్యాలయంలో దుగ్గిరాల బలరామ కృష్ణయ్యగారి చిత్రపటమును అనుమిల్లి సబ్రహ్మణ్యేశ్వరరావుగారు కాంగ్రెసు సేవకుల, అభిమానుల, పౌరుల సముఖములో ఆవిష్కరించిరి. సభకు జిల్లాబోర్డుసభ్యులు గుడివాడ రామచంద్రరావుగారు, అధ్యక్షత వహించిరి. చిత్రపటమును ఆవిష్కరించుచూ గత 25 సం॥నుండి బలరామ కృష్ణయ్యగారు ఆంధ్రసాహిత్యమునకు, విశేషించి వివాహోద్యమునకు, కాంగ్రెసు పక్షమున దేశమునకు, చేసిన సేవను సుబ్రహ్మణ్యేశ్వరరావుగారు కొనియాడిరి. తరువాత రాజనాల సుబ్బారావు, కామినేని వెంకయ్య, మండా వెంకటరెడ్డిగార్లు, ఉపన్యసించిరి. రా. సుబ్బారావుగారి అభివందనములతో సభ ముగిసెను.

## ధనుర్మాస గానసభలు

### గాయకులకు ఆహ్వానము

బందరు, డిసెంబర్ 8: "ధనుర్మాస గాన సభలు ఈ నెల 15 వ తారీకునుండి జనవరి 15 వరకూ బందరుగొడుగు పేటలో వెంకటేశ్వరస్వామివారి ఆలయములో జరుగును. 2 గంటలసేపు సంగీత కచేరీ చేయగలిగిన బాలికలు, బాలురూ, భరతనాట్యము, హరికథలు, మొదలునవి చేయగలిగినవారు ఈ నెల 10 వ తారీకునకు మా కు తారీకు, పేరుతోసహా తెలియచేయవలెను. ప్రక్క వాద్యములు మేమే యేర్పాటు చేయుదుము. వారు పాడగలిగినంత టైము యిచ్చెదము. గాన యేర్పాటుచేసిన అవకాశమును వుపయోగించుకొనవలయునని కోరుచున్నాను." అని అధ్యక్షురాలు వి. కల్యాణమ్మగారు తెలియజేస్తున్నారు. ధనుర్మాస గానసభల కార్యదర్శికి వ్రాసి వివరములు తెలుసుకోవచ్చును.

### రాజమండ్రిలో కాంగ్రెసు ప్రాథమిక సభ్యత్వం 21 వేలు

రాజమహేంద్రవరం, డిసెంబరు 8: ఈ పట్టణంలో 21 వేల మంది, కాంగ్రెసు ప్రాథమిక సభ్యులుగా చేరినట్లు పట్టణ కాంగ్రెసు అధ్యక్షులు డా॥ కె. యల్ నరసింహరావుగారు తెలియజేశారు. (స్వ. వి.)

## పారస్వత్వ అనర్హతల రద్దు చట్టం

### హరిజనశాఖలకు వర్తింప చేయుటకు ప్రభుత్వ విముఖత

ఏలూరు, డిసెంబరు 7: పౌరస్వత్వ అనర్హతల తొలగింపు చట్టమును హరిజనుల లోని అంతశ్శాఖలకుకూడ వర్తింప జేసే విషయంలో తమ విముఖత్వాన్ని వెలిబుచ్చి, ప్రభుత్వం వారీక్రింద ఉత్తర్వులు జారీచేశారు.

"ఇటీవల మద్రాసు రాష్ట్రీయ హరిజన వెల్‌ఫేర్ కమిటీవారు ఈక్రింది సిఫార్సులను జేసియున్నారు. మద్రాసు పౌరస్వత్వ అనర్హతల తొలగింపు చట్టమును హరిజనులలోని అంతశ్శాఖలకుకూడ (వారి మధ్య అనూచానముగా వస్తున్న అంటరానితనము వగైరా నిషేధించేనిమిత్తం)వర్తింప జేయవలయును.

హరిజనులలోని కొన్ని అంతశ్శాఖలకు చెందినవారి, ఉదాహరణకు, తమిళనాడులోని చక్లర్ తెగకు చెందినవారు, ఆంధ్రదేశంలోని మాదిగలు, రెల్లీలు (పాకీవారు) కన్నడదేశంలోని కొరగ తెగవారు, మలబారులోని నాయాడీలు, మున్నగువారి పరిస్థితులు, ఇతర హరిజనులకన్న, అధ్వాన్న స్థితిలో యుండుటవలన, హరిజన క్షేమాభివృద్ధి కార్యక్రమములో, వీరికి విశేషశ్రద్ధ జూపింపవలయును. ప్రభుత్వంవారీ రెండు సూచనలనూ బాగుగా ఆలోచించినమీదట హరిజనులలో కొన్ని తెగలకు, అభివృద్ధి కార్యక్రమంలో ప్రత్యేక పదుపాయములు కల్పించి వారిలో వారికున్న విభేదములను శాశ్వతము చేయరాదనినీ, హరిజనులలో విద్యాభివృద్ధి కలిగేకొలదీ క్రమక్రమముగా వారిలోని శాఖావిభేదములు సమసిపోవునన్న అభిప్రాయపడుతూ, మద్రాసు పౌరస్వత్వ అనర్హతల తొలగింపుచట్టమును హరిజనుల అంతశ్శాఖలకు వర్తింపచేయనట్లుగా సవరించుట అనవసరమని నిశ్చయించినారు."

### కృష్ణాజిల్లా మహిళాసంఘ కార్యవర్గం

కృష్ణాజిల్లా మహిళాసంఘ కార్యవర్గం ఈనెల 4 వ తేదీన విజయవాడలో శ్రీమతి కలగర పిచ్చమ్మగారి అధ్యక్షతన సమావేశమైనది.

ఇటీవల ఆంధ్రరాష్ట్రంలో తుపాను బాధితులకు సరియైన వీడికులకు రు 116లు విరాళమిచ్చుటకు, అప్పటు కృష్ణా జిల్లా మహిళామహాసభ కొమరవోలులో గాని నూజివీడు తాలూకా ఆకిరిపల్లిలో గాని జరుపుటకూ, ఆ సభకు అధ్యక్షురాలిగా శ్రీమతి ఎన్నెని దమయంతిమ్మగారిని, జండాప్రతిష్టాపనకు శ్రీమతి పెద్దాడ సరస్వతీదేవిగారిని, సభా ప్రారంభకురాలిగా శ్రీమతి సూర్యదేవర అన్నపూర్ణమ్మగారిని ఆహ్వానించుటకు వారు తీర్మానించారు.

ఇటీవల కేంద్రశాసనసభలో హిందూ కోడ్‌బిల్లు మార్పువిషయము చర్చకువచ్చినప్పుడు హిందూకోడ్ బిల్లును అంగీకరించవలసిందిగా శాసనసభ వారిని కోరుతూ ప్రధాని పండిట్ నెహ్రూ చేసిన ప్రసంగానికి ఈ సంఘంవారు ఎంతో ఆనందిస్తూ స్త్రీలపట్ల ప్రధానిగారికి గల ఆదరాభిమానాలకు తమ కృతజ్ఞత తెలిపారు.

### హిందూపురంలో పతాక దినోత్సవం

హిందూపురం, డిసెంబరు 8: నిన్నటి దినం స్థానిక మునిసిపల్ హైస్కూలులో పతాక దినోత్సవం జరిపారు ప్రధానోపాధ్యాయులు పి. యమ్. మేఘ్యా మాట్లాడుచూ యుద్ధంలో పోరాడి యుద్ధానంతరంకూడా దేశాన్ని కాపాడుచున్న మన సైనికుల కుటుంబాలను రక్షించడం మన ధర్మం కాబట్టి అందరూ విరివిగానిధికోసం విరాళాలు ఇవ్వాలని ఉద్బోధించారు. అంతకుపూర్వం మేఘ్యాగారు పతాకోత్సవం జరిపారు. (స్వ. వి.)

### బుగ్గ అగ్రహారంలో కలరా

ఇద్దరి మరణం

నగరి, డిసెంబర్ 9: నగరికి సమీపమునగల బుగ్గ అగ్రహారంలో గత రెండు రోజులుగా కలరా వ్యాపించి 5 గురికిసోకి ఇద్దరు మరణించారు. ఆరోగ్యశాఖవారు నేడు ఆ ప్రదేశాలకువెళ్లి తగు చికిత్సలు చేయుచున్నారు. వ్యాధితీవ్రతం తగ్గినట్లు తెలుస్తున్నది. (స్వ. వి.)

కీ॥ శే॥ తూము చూడామణిగారు

పోలవరం, డిసెంబర్ 7: పోలవరంలో పుష్పులూరి కోదండరామయ్యగారిస్వరాజ్యఆశ్రమంలో చాలకాలము సేవచేసి మహాత్ముని ఆదేశానుసారము కారాగారమునకు వెళ్లి స్వరాజ్య సంపాదనకు పాటుపడిన శ్రీమతి తూము చూడామణి అమ్మగారు 3-12-49 న స్వర్గస్థులైనారు.

## కృష్ణాజిల్లాలో కమ్యూనిస్టుల చర్యలు

### అణగిపోయినవని కలెక్టరు వివరణ

విజయవాడ, డిసెంబరు 9: "కమ్యూనిస్టు ఉపద్రవము కృష్ణాజిల్లాలో చాలా వరకు అదుపులోనికి తేబడినది. కాని సంస్థానములోని కమ్యూనిస్టులు చాలా తోరుగా ఉండుటవలన సరిహద్దులను అప్రమత్తతతో కాపలా కాయుట అత్యవసరము" అని కృష్ణాజిల్లా కలెక్టర్ జఫిర్‌గారు నేడు ఆంధ్రపత్రిక ప్రతినిధితో సంభాషించుచూ తెల్పిరి.

### తుపాను బాధితులకు సహాయం

తుపాను బాధితులకు ఇంతవరకు రూ 5,15,000 పంచబడినవనియూ, ఇంకొక లక్షరూపాయల నిమ్మని తాము ప్రభుత్వము నర్థించితిమనియు కలెక్టరుగారు చెప్పిరి.

నేటివరకు ప్రభుత్వ మారంభించిన సహాయనిధికై రూ 50 వేలు వసూలయినవని కలెక్టరుగారు తెల్పుచూ, విరాళములనిచ్చిన వారికి తమకృతజ్ఞత తెలియజేసిరి. (స్వ. వి.)

## 'గాంధీవలస' గ్రామానికి శంకుస్థాపన

### పార్వతీపురం తాలూకాలో

పార్వతీపురం, డిసెంబరు 7: పార్వతీపురం తాలూకాలో అడ్డాపుశీలగ్రామమునకు దగ్గరగా మొన్న ఉదయం 9 గంటలకు "బెలగాం సీనియరు జమీందారు వారి యాజమాన్యమున "గాంధీవలస" అను పేరుగ ఒక గ్రామమునకు నూతనముగా శంఖుస్థాపన జరుపడమయినది. తాలూకా హరిజనోద్ధరణ గ్రామ పునర్నిర్మాణ సంఘమువారి కృషిమూలముగా ఈ నూతన గ్రామము కట్టుచున్నారు. శంఖుస్థాపన సమయమునకు అనేకమంది రైతులు పరసర గ్రామములనుండి వచ్చిరి. ఈ సందర్భములో సుమారు 100 మంది బీదలకు అన్నదానం జరుపడమయినది. భోజనానంతరం మధ్యాహ్నం బెలగాం సీనియరు జమీందారువారి పుత్రులు నృసింహనారాయణ తోట్రాజుగారి అధ్యక్షతను సభ జరిగింది.

## కెంటన్ కమిటీ భవనం

### సీతారామరెడ్డిగారిచే శంకుస్థాపన

ఆదోని, డిసెంబరు 6: ఆదోనిలో కెంటన్ కమిటీ భవనమునకు మద్రాసు రెవిన్యూమంత్రి హెచ్. సీతారామరెడ్డిగారు శంకుస్థాపనము చేసిరి. ఈ సందర్భమున జరిగిన సభలో పలువురు ఉపన్యసించిరి. తేనీటివిందు జరిగినది.

ఆదోనిలో అగ్నిమాపక యంత్రమును స్థిరముగా నెలకొల్పు పనుయదున మంత్రిగారు యంత్రమును దర్శించి ప్రారంభోత్సవము జరిపి యంత్రోపయోగమునుగూర్చి వివరించిరి. తర్వాత మంత్రిగారు సాయంత్రం 4-30 గంటలకు మద్రాసు వెళ్లిరి. (స్వ. వి.)

### తూ. గో. బోర్డు ఉపాధ్యక్షుని ఎన్నిక వాయిదా

కాకినాడ, డిసెంబర్ 7: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కార్యాలయమునుండి వచ్చిన తాఖీదు ననుసరించి యీరోజున జరుగవలసిన తూర్పు గోదావరి జిల్లాబోర్డు ఉపాధ్యక్షుని ఎన్నిక వాయిదాపడినట్లు తెలుస్తూంది. (స్వ. వి.)

### అంపాపురంలో బాపూజీ గ్రంథాలయానికి శంకుస్థాపన

అంపాపురం, డిసెంబర్ 8: అంపాపురం గ్రామ వాస్తవ్యులు కాకాని రామయ్యగారి అధ్యక్షతను సమావేశమై "బాపూజీ" గ్రంథాలయమును నెలకొల్పుటకు నిశ్చయించిరి. కోటగిరి వెంకటనరసింహ సత్యనారాయణరావుగారిచే దీనికి శంఖుస్థాపన జరుపబడినది.

### చెన్నరాష్ట్ర చేనేతసహకార సంఘసర్వసభ్య సమావేశం

తణుకు, డిసెంబరు 9: చెన్నరాష్ట్ర చేనేత సహకారసంఘ సర్వసభ్య సమావేశం యీ నెల 25 వ మద్రాసులింగిచెట్టి వీధిలోని క్రిస్టియన్ కాలేజీ హైస్కూలులో జరుగునని ప్రగడకోటయ్యగారు తెలియజేస్తున్నారు.

### మద్యనిషేధచట్టం క్రింద శిక్షలు

మంగళగిరి, డిసెంబరు 8: సబ్ మాజిస్ట్రేటు పి. సీతారామయ్యగారు మద్యనిషేధ చట్టం క్రింద 8 మందికి జుల్మానాలు, కఠిన శిక్షలు విధించారు.

జహీర పహనాలలో కల్లీపూటు కల్లి అమ్మినందుకు ముగ్గురు స్త్రీలకుకూడా జుల్మానాలు, అవి కట్టనిచో జైలు శిక్షలు విధించారు. (స్వ. వి.)

## కొల్లేరు వడ్డెవారి ఇక్కట్లు

### ఫిషింగ్ లైసెన్సు రుసుము రెమిషన్ యివ్వాలని విన్నపం

విజయవాడ, డిసెంబరు 9: కొల్లేరు నాశ్రయించుకొని జీవనము చేయుచున్న వడ్డెవారికి తుపానువలన చాలానష్టము సంభవించినది. భూములు కలవారికి వరిపంట మునిగిపోయినది. ఇళ్ళు చాలా కూలిపోయినవి. అందరకూ సంభవించిన ఈ కష్టములు కాక, చేపలను పట్టు పనులు [మావులు] గాలికి కొట్టుకొనిపోయి పగిలిపోయినవి. పైగా కొల్లేరు ప్రమాదముగా పొంగిపోవుటచే, చేపలు చుట్టుప్రక్కల పొలములలోనికి కొట్టుకొనిపోయి, మామూలుగా దొరుకుచున్న చేపలు దొరుకుటలేదు వృత్తులన్నియు తాత్కాలికముగా ఆగిపోవుటచే కూలికూడా దొరకుటలేదు. ఇది ఇట్లుండగా చేపలశాఖ అధికారులువచ్చి "ఫిషింగ్ లైసెన్స్" రుసుమును కట్టుమని అడుగుచున్నారని, నిన్న విజయవాడ అసిస్టెంటు ఫిషరీస్ డైరెక్టరు వద్దకువచ్చి కొల్లేరు వడ్డె మహాసభవారు విన్నవించిరి.

వడ్డె మహాసభ తరఫున, సభాధ్యక్షుడు జయమంగళ రెడ్డి, యం. చంద్రశేఖర్‌గారలు ఫిషరీస్ అసిస్టెంట్ డైరెక్టర్ వి. రామమోహన్ రావుగారితో, భూమిశిస్తు రెమిషన్లు నిచ్చినట్లే ఈ ఫిషింగ్ లైసెన్స్ రుసుముకూడా రెమిషన్ నివ్వవలసినదిగా కోరిరి.

అసిస్టెంట్ డైరెక్టర్‌గారు తామీ విషయమును అహార మంత్రిగారికి తెలియజేసెదమని చెప్పిరి. (స్వ. వి.)

### మద్యనిషేధంకింద శిక్షలు

మంగళగిరి, డిసెంబరు 9: స్థానిక సబ్ మాజిస్ట్రేటు పి. సీతారామయ్యగారు మద్యనిషేధ చట్టంకింద వీరవంచకంచర్ల నాగభూషణంకు సారా త్రాగినందులకు 2 మాసములకఠినశిక్ష, నక్కా పుల్లయ్యకు త్రాగినందులకు 2 మాసములు కఠినశిక్ష, మేరికనపల్లి నాగేశ్వరరావుకు 2 మాసములు కఠినశిక్ష, చోరగుడి మల్లమందకు త్రాగినందులకు 2 మాసములు కఠినశిక్ష విధించిరి. సూరగాని కోటప్పకు రు 70/-లు జరిమానా, చోళ్ల సుబ్బారెడ్డికి రు 50/-లు, కవుసం సూర్యనారాయణకు రు 50/-లు, వుయ్యూరు వీరాస్వామికి త్రాగినందులకు 2 నెలలు కఠినశిక్ష, పై. నాగమ సూరగాని కోటప్పకు చెరి రు 50/-లు జరిమానా లేక 6 వారములు కఠినశిక్ష విధించిరి. (స్వ. వి.)

### దేవాలయంలో చోరీ

భీమవరం, డిసెంబరు 9: భీమవరం మున్సిపల్ ప్రాంతంలో ఉన్న గునుపూడి గ్రామంలోని శ్రీ సోమేశ్వర జనార్ధనస్వామి ఆలయంలో యీనెల 6వ తేదీ రాత్రి వెండి రుద్రపాదుకలు, వెండి పళ్ళెము, బంగారు మంగళసూత్రములు, ఇత్తడి బిందె, పళ్ళెము దొంగిలింపబడినవి. పోలీసులుదర్యాప్తు చేస్తున్నారు. (స్వ. వి.)

### హిందూస్తాన్ స్కౌటు సంఘం

దాచేపల్లి, డిసెంబరు 9: ఈనెల 2వ తేదీ నుండి 8వ తేదీవరకు, గుంటూరుజిల్లా స్కౌటుసంఘమువారి యాజమాన్యమున, దాచేపల్లి గ్రామములో కబ్‌మాస్టర్ల శిక్షణశిబిరము నిర్వహింపబడినది. పల్నాడు తాలూకానుండి 30 మంది ఉపాధ్యాయులు శిక్షణపొందిరి. రెడ్డు కాప్రసాద్ శిబిరాధిపతిగాను, టి. శేషగిరిరావు, జె. అప్పారావు, జి వి. నరసింహారావుగారు, గుంటూరు సహాయులుగానుండి, శిక్షణ తరగతులు నడపిరి.

## సభలు సమావేశములు

నెల్లూరుజిల్లా, ఉదయగిరి తాలూకా, 3 వ రైతు కాంగ్రెసు మహాసభ: 16-1-50 తేది. ఉదయం. 9-30 గంటలకు, సీతారాంపురంలో జరుగును. అధ్యక్షులు, గా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు సభా ప్రారంభకులు. గా॥ హెచ్. సీతారామరెడ్డిగారు.

ఆంధ్రరాష్ట్ర వ్యవసాయకూలీ యూనియన్ కార్యవర్గ సమావేశము విజయవాడ కో ఆపరేటివు యూనియన్ ఆఫీసు బిసెంటురోడ్డు గవర్నరుపేట విజయవాడలో తేది 14-12-49 సాయంత్రము 2 గం॥లకు యూనియన్ అధ్యక్షులు జే. కూర్మయ్యగారి అధ్యక్షతన సమావేశమగును.

తణుకుతాలూకా గ్రామోద్యోగీయ సంఘమహాసభ 21-12-49 తేదీ బుధవారం మధ్యాహ్నం 12 గంటలకు తణుకులోని సంఘభవనమందు జరుగును.

మదరాసు బి క్లాసు రిజష్టర్డు చేసియ వైద్యసంఘ స్థాయిసమితి సమావేశం యీ నెల 18 న పామర్లకోటలో కవిరాజ ప్రతివాది భయంకర కృష్ణమాచార్యులుగారి అధ్యక్షతన జరుగును.

## నిడుబ్రోలలో పశువుల ఆస్పత్రి

### కొల్లి మంగమ్మగారి వితరణ

నిడుబ్రోలు, డిసెంబరు 8: యిచ్చట 'పశువుల ఆస్పత్రి' నిర్మించే యేర్పాట్లు చురుకుగా సాగుచున్నవి.

కొల్లి మంగమ్మగారు, ఆస్పత్రి భవనానికి 75 సెంట్ల స్థలాన్ని దానం చేశారు. జిల్లా పశువైద్య శాఖాధికారి వి. అప్పారావుగారు, 6, 7 తేదీలలో యిచ్చట మకాంచేసి సంప్రదింపులు జరిపి వెళ్లారు. యీ భవనానికి కావలసిన ద్రవ్యాన్ని చందాల రూపేణ ప్రజల వద్ద వసూలు చెయ్యటానికి, ఆస్పత్రి నిర్వహణంలో అయ్యే ఖర్చులో ప్రతి సంవత్సరం నాల్గవ వంతు భరించటానికి పెద్దలంతా వాగ్దానం చేశారు. (స్వ. వి.)

### బరంపురమునకు జయప్రకాష్ రాక

బరంపురం, డిసెంబరు 6: ఈ నెల 3 వ తేదీ సాయంకాలం సోషలిస్టు నాయకుడు శ్రీ జయప్రకాష్ నారాయణగారు స్థానిక ఆంధ్ర విజ్ఞానమిత్ర మండలి ఆవరణను విచ్చేసి, పఠనాలయం, గ్రంథాలయం దర్శించి, మండలివారిచ్చిన స్వాగత పత్రాన్ని అందుకున్నారు. స్వాగతి పత్రం మండలి అధ్యక్షులు ఎం. వి. రమణా రావుగారు చదివిన పిమ్మట, జయప్రకాష్ నారాయణగారు జవాబుచెప్తూ తనకు చేసిన సన్మానానికి కృతజ్ఞత తెలియజేసిరి. ఈ మండలి, సాంస్కృతి కాభివృద్ధికి, విజ్ఞానాభివృద్ధికి చేస్తున్న సేవను ప్రశంసించి, యీ విధమైన సేవ నిజంగా దేశాభ్యుదయానికి పరమావసరమనిరి.

తర్వాత వీరిని విజ్ఞానమిత్ర మండలి ఊరేగింపులో కాలేజీ ఆవరణకు తీసుకువెళ్లిన తర్వాత అక్కడ బహిరంగ సభలో ఆయన ఉపన్యసిస్తూ సోషలిస్టు పార్టీని ప్రజలందరు బలపరచవలసిందని చెప్పారు.

ఈ సభకు డాక్టరు ఫిరోజ్ ఆలీగారు అధ్యక్షత వహించారు. గరికిపాటి రామారావుగారి వందనార్పణతో సభముగిసింది. స్వ. వి.

## ఆంధ్ర విద్యార్థి కాంగ్రెస్ వ్యాసరచన పోటీలు

విజయవాడ, డిసెంబరు 7: ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు అధ్యక్షులు సుంకర సత్యనారాయణగారు ఇలా వ్రాస్తున్నారు: నాల్గవ ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెసు మహాసభల సందర్భములో వ్యాసరచనపోటీలు ఏర్పాటు చేయబడినవి. విద్యార్థులు మాత్రమే పాల్గొనవచ్చును. పాల్గొను విద్యార్థులు విద్యాలయాధికారులవద్దనుండి అర్హతాపత్రములను వ్యాసములతోబాటు పంపవలయును. వ్యాసములు డిసెంబరు 20 వ తేదీలోగా మా కార్యాలయమునకు చేరవలయును. ఆంగ్లమునగాని, తెలుగులోగాని వ్యాసములు వ్రాయవచ్చును. విషయములు:—

(1) హైదరాబాదు ప్రజారాజ్య రాజకీయ సిద్ధాంతము, (2) విద్యార్థుల కష్టనిష్ఠూరములు, వాటి నివారణోపాయములు, (3) ఆంధ్రరాష్ట్ర పునర్నిర్మాణము.

యీ సందర్భములో పై వాటితోపాటు వాగ్వివాదపోటీలు, సంగీతపు పోటీలు, నాటికలపోటీలు, బుర్రకథపోటీలు కూడ జరుగును. దరఖాస్తులు ఫీజుతోబాటు డిసెంబరు 20 లోగా చేరవలయును. ఫీజు నాటికకు రూ 5/-లు, బుర్రకథకు రూ 3/-లు. మిగతా వాటికి ప్రవేశరుసుము లేదు. నాటికా బృందములు వారి స్వంతఖర్చులతో వచ్చి ప్రదర్శనమీయవలయును. నాటిక ప్రతిని దరఖాస్తుతోబాటు పంపవలయును. మహాసభలో "మాక్‌పార్లమెంటు" కూడ జరుగును. పాల్గొను ప్రతి ఒక్కరూ రు. 1/- చెల్లించవలెను.

### ఆంధ్ర విద్యార్థి ఒలింపిక్ పోటీలు

ఆటల పోటీలలో విద్యార్థులుమాత్రమే పాల్గొనవచ్చును. పోటీదారులు తమ గుర్తింపు పత్రములకు విద్యాలయాధికారుల వద్దనుండిగాని వ్యాయామశిక్షకుల వద్దనుండిగాని తీసికొనిరావలయును. 1949 సెప్టెంబరు పరీక్షకు హాజరైన విద్యార్థులు, ట్యుటోరియల్ కాలేజీ విద్యార్థులుగూడ, విద్యార్థులుగా గుర్తింపబడుదురు. దరఖాస్తులు ఫీజుతోపాటు డిసెంబరు 12 లోగా విద్యార్థి కాంగ్రెసు కార్యాలయమునకు చేరవలయును. వివరములకు, ఆంధ్రరత్నభవనము విజయవాడ అని వ్రాయవలెను.

### ప్రజారక్షణ చట్టమునకు గవర్నరు ఆమోదం

మదరాసు, డిసెంబరు 10: మదరాసు గవర్నరు ఆమోదము పొందిన ప్రజారక్షణ చట్టమును డిసెంబరు 9 తేదీ అసాధారణ గెజెటులో ప్రకటించిరి.

## బాధ్యతానిర్వహణకు పూనుకోవాలి

### సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షుడు బిందూగారి ఉద్బోధ

హైద్రాబాద్, డిసెంబర్ 10: "అమితంగా మాట్లాడటం కంటే మనకు సంక్రమించిన బాధ్యతలను నిర్వహించటానికి పూనుకొని యుండుట మనందరికి నా వారమని బుజువు చేసుకోవటం మంచిది." అని సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులుగా ఎన్నికైన దిగంబరరావు బిందూగారు ఆంధ్రపత్రిక విలేఖరితో నేడు ఒక ఇంటర్వ్యూలో అన్నారు.

హైద్రాబాద్ సంస్థాన కాంగ్రెస్ సంఘంలో ఐకమత్యం పునరుద్ధరించటానికి కృషి చేసిన వారందరికి బిందూగారు కృతజ్ఞత తెలియజేశారు. సంఘ అభివృద్ధికి ముఖ్యమైన ఆటంకిగా నున్న అంతరంగిక ప్రతిష్టంభన పరిష్కరింపబడింది. అయితే సంఘంలోని వివిధ శక్తులను ఒక త్రాటి మీదకు తీసుకొని వచ్చి, సంఘాన్ని బలవత్తరమైన సంస్థగా తయారు చెయ్యటానికి యింకా కొంతకాలం పడుతుంది. బిందూగారు సాధ్యమైనంత త్వరలో సాధించ వలసిన మొదటి కార్య భారం యిదే. ఇది నక్క వ్యక్తి వల్ల సానుకూలమయ్యే పనికాదు. సంస్థాన కాంగ్రెసు వాదులందరి తోడ్పాటు అవసరం.

బిందు గారిని అభినందిస్తూ, సంస్థానంలోని ప్రముఖుల నుండి, బయటి ప్రముఖుల నుండి అభినందన సందేశాలు వస్తున్నవి. వీరిలో కర్నాటక రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుడు నిజలింగప్ప, హైద్రాబాద్ హోంశాఖా మంత్రి డి. ఎస్. బాక్లే గారలు కూడ ఉన్నారు. (స్వ. వి.)

## భాషా ప్రయుక్తరాష్ట్ర విభజన సిద్ధాంతం

### రంగాగారి వివరణ

సికంద్రాబాద్, డిసెంబరు 11: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు శ్రీ ఎన్.జి. రంగాగారు మొన్న యిక్కడ ఒక బహిరంగసభలో ప్రసంగిస్తూ, భాషాప్రయుక్త రాష్ట్ర విభజన సిద్ధాంతాన్ని ప్రభుత్వం ఆమోదించింది, ప్రజల రాజకీయ జీవితానికి, భాషకు సంబంధం ఉన్నదని కాదనీ, దేశంలోని వివిధ అంతర్భాగాలలో సామర్థ్యంతోకూడిన అభివృద్ధికరమైన పరిపాలన ఉండగలదనేది ధ్యేయంతోనే ప్రభుత్వం దీనిని ఆమోదించిందనీ అన్నారు. ఏదైనా కొత్తరాష్ట్రాన్ని నిర్మించవలసిందని కోరినప్పుడు ఆనూతన రాష్ట్రంలో పరిపాలనా సౌలభ్యం ఉండదని తోచినప్పుడు ఆకోరిక నిరాకరింపబడుతుందన్నారు. అందుచేతనే శిక్కు స్థాన్‌కోరిక నిరాకరింపబడుటు, మిగిలిన రాష్ట్రాల కోరికలు, అనగా కర్ణాటకం మొదలైనవాటిని ఆమోదించుట జరిగిందన్నారు. ప్రత్యేక రాష్ట్రంగా చేయటానికి తగినంత ప్రదేశాన్ని కూడ సిక్కులు చూపలేకపోయారన్నారు.

## బీబీనగర్ కేసు

### ముద్దాయిల దరఖాస్తులు త్రోసివేత

సికంద్రాబాద్, డిసెంబరు 11: బీబీనగర్ కేసు విచారిస్తున్న ప్రత్యేక న్యాయస్థానం ఖావరాలీఖాన్, మెహతాబ్, (ముద్దాయిలు) తాము తమ యిండ్లకువెళ్లి కొన్ని పత్రాలు తెచ్చుకొనుటకు అనుమతించవలసిందని కోరుతూ పెట్టుకొన్న దరఖాస్తులను త్రోసి వేసింది.

న్యాయస్థానం నిన్న సమావేశమైనప్పుడు కాశింరజ్వీని, మిగిలిన ముద్దాయిలను, యీ కేసులో విచారించటానికి ఈ న్యాయస్థానానికి అధికారంలేదని రజ్వీ వకీలు ముస్తాఫాహుస్సేన్ తన వాదమును కొనసాగించెను. కోర్టు 12 వ తేదీకి వాయిదా వెయ్యబడింది. ఆ రోజున ఈ విషయంపై ప్రాసిక్యూషన్‌వారు తమ వాదమును తెలియజేస్తారు.

### సెకెండ్‌గ్రేడ్ ప్లీడర్లు

అడ్వకేట్లుగా నమోదు కావచ్చు

చెన్నపట్నం, డిసెంబరు 9: చెన్నరాజధానిలో ఒకేవిధమైన న్యాయవాదులు ఉండవలెనని మదరాసు బార్ కౌన్సిలు చేసిన సిఫార్సును అనుసరించి సెకెండ్ గ్రేడ్ ప్లీడర్లుకూడా అడ్వకేట్లుగా నమోదు కావటానికి అవకాశమొసగుచూ మదరాసు హైకోర్టు ఒక నిబంధన గావించియున్నది. 15 యేండ్లకాలము ఎవరైనా న్యాయవాదవృత్తి సాగించిన సెకెండ్ గ్రేడు ప్లీడర్లు యీ నియమము ప్రకారం అడ్వకేట్లుగా దాఖలు కావచ్చును. ఇట్టి అవకాశము ప్రభుత్వము మొదట ఫస్టుగ్రేడు ప్లీడర్లకు మాత్రమే ఒసగెను. అది యిప్పుడు సెకెండుగ్రేడు ప్లీడర్లకు సయితము వర్తింప చేయబడినది.

## మదరాసు వార్తలు

మదరాసు, డిసెంబర్ 11: జయరామన్ (19) మరొకన్ని సై నాబజార్‌లో దొంగతనం నేరముక్రింద సబ్‌ఇన్‌స్పెక్టరు హుస్సేన్ అరెస్టుచేశారు. ఒకఫిల్మ చైనుగా దొంగిలించినట్లు నేరముసాధించి వారిని ఖజానాలో వుంచిరి.

* * *

నిన్నరాత్రి 8 గంటలకు చాకలిపేటలో ఇద్దరు పోలీసులు గస్తీకెళ్లగా ఇద్దరు ఒంటికి వెళ్లుచున్నట్లు నటించి తరువాత పదిమందివచ్చి పోలీసులను కొట్టిరి. చేసిన బ్రిక్కీగర్లకూడ ఇట్లనే మరిద్దరిని కొట్టినట్లు తెలియుచున్నది. పోలీసులకు గాయములు తగిలెను. కేసు నమోదుచేశిరి పోలీసుల తలపాగా దొంగిలించుట, డ్యూటీలోవున్న ఉద్యోగులను కొట్టుటక్రింద కేసు నమోదు చేశిరి. నేరస్థుల జాడ తెలియలేదు. పరిశోధన జరుగుచున్నది.

### ఆసియా అంతర్జాతీయ టెన్నిసు పందెములు

చెన్నపట్నం, డిసెంబరు 10: కలకత్తాలో యీ జనవరిలో జరిగే ఆసియా అంతర్జాతీయ టెన్నిసు పందెములలో పోటీ చేయుటకు చెన్నరాష్ట్ర టెన్నిస్ సంఘమువారు తమ సంఘ ప్రతినిధులుగా నామినేటు చేసిన 7 గురు ఆటకాండ్రలో శ్రీ పి. యల్. నారాయణరావు, శ్రీ యస్. భుజంగరావు, శ్రీ జానకిరామయ్యగార్లు అక్కడికి పోజాలమని తెలుపుటవల్ల వారికి బదులు టి. వి. రామారావు, వి. రంగనాథన్, యం. వి. రామస్వామి గార్లను రాష్ట్ర సంఘము నియమించినదని గౌరవ కార్యదర్శి శ్రీ యం. యస్. సాస్త్రి గోపాల్‌గారు తెలుపుచున్నారు.

### పశువైద్య మహాసభ

9 వ రాష్ట్రీయ పశు వైద్యమహాసభ యీ నెల 26, 27, 28 తేదీలందు వైపెరి కాలేజీయందు జరుగును. టి. వినాయక మొదల్యారు అధ్యక్షత వహింతురు. మంత్రి ఎ. బి. షెట్టిగారు ప్రారంభోపన్యాసము నొసగెదరు.

### కార్పొరేషను విద్యాశాఖ బడ్జటు

మదరాసు కార్పొరేషను విద్యాశాఖ బడ్జటులు కమిటీకు 1950-51 సం॥ నకు తయారుచేసినదానిలో రాబడి రూ. 25,45,859 ఖర్చు, రూ. 28,04,640 సూచించిరి. లోటు రూ 2,57,771. లోటు తీర్చుటకు చిన్న యిండ్లపై ఆస్తిపన్ను పెంచాలని సూచించిరి. ఈ యేడు 15 క్రొత్త పాఠశాలలు ప్రారంభించుటకు 40,000 ఖర్చు యేర్పాటుచేసి, క్రొత్తగ ఒక అసిస్టెంటు ఎడ్యుకేషనలు ఆఫీసరుని నియమింపదలచిరి భవన నిర్మాణమునకు రూ 8 29500 ప్రభుత్వంవద్ద ఋణం కోరదలచిరి.

### రాష్ట్రీయ హెడ్‌మాస్టర్లసభ

మదరాసు క్రిష్టియను కాలేజి హైస్కూలునందు డిసెంబరు 28, 29 తేదీలందు రాష్ట్రీయ హెడ్మాస్టర్లులసభ జరుపుటకు మదరాసు హెడ్మాస్టర్ల సంఘంవారు ఏర్పాటుచేసిరి. సభకువచ్చే ఖర్చులు ఆయా విద్యాసంస్థలు భరించుటకు విద్యాశాఖ డైరెక్టరు అంగీకరించినట్లు తెలియుచున్నది. ప్రతినిధులుగా రావలచినవారు డిసెంబరు 22 తేదీలోగా, కె. హనుమంతరావుగారు, హెడ్‌మాస్టరు, పెరంబూరు వివరములకొరకు వ్రాయవలెను.

### ధాన్య సేకరణ

మదరాసు, డిసెంబరు 9: రాష్ట్రములో డిసెంబరు 3తో అంతమైనవారములో క్రిందటివారముకన్న రెట్టింపు 18,667టన్నుల బియ్యం సేకరించబడెను.

జిల్లాలవారి అంకెలు: బ్రాకెటులోని అంకెలు గత వారపు సేకరణ సంఖ్యలు అయి ఇచ్చిన అంకెలు న్నవి. తూర్పుగోదావరి 1420టన్నులు (683) గుంటూరు195(250) కృష్ణా 549 (218) నెల్లూరు 526 (87) తంజావూరు 3269 (312) పశ్చిమగోదావరి 3931 (1069) డిసెంబరు 3న 1,58,904 టన్నుల బియ్యం నిల్వయున్నది.

నగరములో డిసెంబరు 8న 25 రోజులకు సరిపడు 6039 టన్నుల వుప్పుడు బియ్యము 2581 టన్నుల పచ్చిబియ్యము నిల్వయున్నవి.

### ఉద్యోగవార్తలు

మద్రాసు, డిసెంబరు 10: రెవిన్యూ బోర్డు శ్రీ పి. కె విజయరాఘవన్ డిసెంబరు 5 నుండి 15 రోజులు సెలవు మంజూరు చేసిరి.

రాంపేరు డివిజన్ ఎగ్జిక్యూటివు ఇంజనీరు శ్రీ టి. యస్. వెంకటేశ్వర్లు విశాఖపట్నం జిల్లా ఇరిగేషన్ స్కీముల పరిశోధన స్పెషల్ డివిజన్ ఎగ్జిక్యూటివు ఇంజనీరుగా నియమింపబడిరి.

పశ్చిమగోదావరిజిల్లా తహశీల్దార్ శ్రీ పి. సత్యనారాయణ శాస్త్రికముగా తూర్పు గోదావరి జిల్లా జనరల్‌డ్యూటీ డిప్యూటీ కలెక్టరుగ నియమించబడిరి

## నోటీసులు

కడప డిస్ట్రిక్టు మునసపు కోర్టులో

S. C. No. 325/1949.

వాది: మల్లంగి కృష్ణయ్య.

ప్రతివాదులు: 1. పరమటిపల్లి నాగిరెడ్డి, 2 యర్రగుడి మంగమ్మ.

రాయచోటి తాలూకా రౌతుగుంట గ్రామము మజరా పోతువాండ్లపల్లెలో వుండే 2-వ ప్రతివాదికి:- వాది నీవగైరాలు యివ్వవలసిన ప్రోనోటు బాకీకి గాను పై దావాను దాఖలు చేసివున్నాడు. సదరు దావా 20-12-49 తేదికి వాయిదా వేయబడివున్నది. ఆ రోజు నీవు పగలు 10 గంటలకు కోర్టులో హాజరై ఆక్షేపణను తెల్పుకొననంతట విచారణ జరుపబడునని తెలుపడమయినది.

జె. వి. రాంమోహన్ రావు, వాది అడ్వకేటు, కడప.

నిడదవోలు ఉత్పత్తి - కొనుగోలు సహకారసంఘం (మార్కెటింగుసంఘం) యొక్క సర్వసభ్య సమావేశము 26-12-49 తేది మధ్యాహ్నము 1 గంటకు నిడదవోలు గౌరీశంకర సత్రము వద్ద ఏర్పాటు చేయుడమయినది. అందు ఈ దిగువ సంగతులు చర్చించబడును. కాన సభ్యులెల్లరూ వచ్చి సమావేశం జయప్రదముగా జరిపించకోరుతాను.

1. సంఘ నిబంధనలలో 29 C. 89 నిబంధనను ఆమోదించుట
2. 1948 to 1949 సంవత్సర ఆడిటు రిపోర్టు ఆమోదించుట
3. నూతన డైరెక్టర్ల యెన్నిక
4. యితరములు.

(Sd) మహబూబ్ ఖాన్, B. A. అగ్రాసనులు.

టెండరు

మద్రాసు, గవర్నమెంటు జనరల్ ఆస్పత్రి, ఔట్-పేషెంటు డిపార్టుమెంటు కాంపౌండులో సైకిల్ స్టాండును 1-4-1950 తేదినుండి 1950-51 సంవత్సరము వరకు అద్దెకు తీసుకొనుటకు, ఉదయము 6 గంటలనుండి 8 గంటలవరకు అన్ని రోజులలోను, సైకిల్ 1-కి రు 0-0-6 ల వంతున రుసుము వసూలు చేసుకొను హక్కుకు, సీలుచేసిన టెండర్లు 3-1-1950 ఉదయము 11 గంటలవరకు తీసుకొనబడును. టెండర్ల మీద "Tender for the lease of Cycle Stand" అని వ్రాసి, మద్రాసు, గవర్నమెంటు జనరల్ ఆస్పత్రి సూపరింటెండెంటు విలాసమునకు పంపవలెను. నిబంధనలు దారునుండి టెండరు షరతులు తెలిసికొనవచ్చును.

సంఘం లాల్, లెఫ్టినెంటు కల్నల్, సూపరింటెండెంటు, గవర్నమెంటు జనరల్ ఆస్పత్రి, మదరాసు.



ADS

# 'వ్యవసాయసౌకర్యాలుకలిగించనిదే ఆహారోత్పత్తి ఉద్యమం ఫలించదు'

## చిత్తూరు జిల్లా ఆహారసంఘ సమావేశంలో సూచన

చిత్తూరు, డిసెంబరు 10: మొన్న రాత్రి మద్రాసు ఆహారశాఖామంత్రి ఘోష్ ట్రోరియాగారు వెల్లూరునుంచి యిచ్చటికి వచ్చిరి. ముసాఫర్ బంగళావద్ద, జిల్లాఅధికారులు, శాసనసభ్యులు, పురప్రముఖులు చాలమంది వారికి స్వాగతమొసగిరి.

నిన్నటి ఉదయం మంత్రిగారు వయోజనవిద్యాసమితి ఆధ్వర్యమున జరిగినసభకు హాజరై అచ్చట పైసమితి ప్రారంభోత్సవము జరిపిరి.

పిమ్మట మంత్రిగారు జిల్లా కలెక్టరు ఆఫీసునందు జరిగిన జిల్లా ఆహారసంఘ సమావేశమునకు హాజరై సమావేశమునకు అధ్యక్షత వహించిరి. దీనికి శాసనసభ్యులు అనధికారసభ్యులు, జిల్లా అధికారులు హాజరైయుండిరి.

జిల్లాకలెక్టరుగారు ఎన్. సుబ్రహ్మణ్యంగారు సమావేశ ప్రారంభమున జిల్లాలోని అన్ని తాలూకాలందు అధికాహారోత్పత్తి ఉద్యమము యేవిధంగా జరుగుచున్న విషయం వివరంగా సభికులకు విశదపరచిరి. పిమ్మట శాసనసభ్యులైన కె. వరదాచారి గారు ఉపన్యసిస్తూ ప్రభుత్వమువారు అధికాహారోత్పత్తిని గురించి ఎన్నివిధముల ప్రచారం సాగించినా అచ్చటచ్చట చెరువులు, చిన్నచిన్న నదులకు ఆనకట్టలు మొదలగు సౌకర్యములు కలిగించి నీటిపారుదలకు అవకాశములు గల్గించినదే కాని అధికాహారోత్పత్తి కార్యక్రమం ఒక రూపానికి వచ్చి ఫలించదనీ, ఇందుకు శీఘ్రంగా జమీందారీలను ప్రభుత్వంలో చేర్చుకోవడం పై యుద్యమానికి మరింత సహాయకారి కాగలదనీ అన్నారు.

టి. కె. టి. యస్. ఆర్. తాతాచారి ఎం. ఎల్. ఎ. గారు ఉపన్యసిస్తూ అధికాహారోత్పత్తి ప్రచారం బాగా సాగుచున్నదిగాని, మనకు కావలసినంత ఆహారం లభించుటలేదన్నారు. అధికారులు ధాన్యసేకరణ విషయములో చాలా దౌర్జన్యంగాకూడా ప్రవర్తిస్తున్నారని వింటున్నామన్నారు. ఈ ప్రకారం చేయుటవలన రైతులకు ప్రభుత్వం మీద ద్వేషం ప్రబలి అధికాహారోత్పత్తికి ఆటంకం కలుగుతుందనీ, దీనివల్ల కార్యసాఫల్యము కాదనీ, కాబట్టి అధికారులు సమయానుసరించి ప్రవర్తించి ఎరువులు, విత్తనములు సప్లైచేసి వారికి ప్రోత్సాహమివ్వడమే యుచితమనీ అన్నారు.

మత్స్యశాఖాసహాయ కార్యదర్శిగారు ప్రస్తుతము కేంద్ర ప్రభుత్వమువారి కోటా మద్రాసు రాష్ట్రంలో ఉత్పత్తి రెండు కలిసికూడ మనకు కావలసిన ఆహారములభించటంలేదనీ, యిందుకుగాను సముద్రదూరంగా ఉండే చిత్తూరు జిల్లావంటి చోట్లలోకూడా చెరువులలో, బావులలో చేపలను పెంచితే ఆహారసమస్యను కొంతవరకు ఎదుర్కొన్నవాళ్ళ మవుతామనీ అన్నారు.

మంత్రిగారు ప్రసంగిస్తూ మొదటనే ఆహారవిషయంగా వెనుకపడి యున్న మద్రాసు రాష్ట్రం తుపానుచేత మరింత దెబ్బతినిందనీ, దానివలన ధాన్యసేకరణ విషయంలో కొంచెం కఠినంగానే ఉండవలసివస్తుందనీ కాని రైతులమీద దౌర్జన్యాలు జరగకుండ చూపటం విషయంలో ప్రభుత్వం ఇంకా జాగ్రత్త తీసుకుంటుందనీ అయితే ప్రజలందరు అన్ని విధాలా ప్రభుత్వంతో సహకరిస్తేనేగాని యీ తీవ్రసమస్య పరిష్కారం కావడం అసాధ్యమనీ అన్నారు. తదుపరి కలెక్టరు వందన సమర్పణముతో సభముగింపబడెను.

అనంతరం మంత్రిగారు మధ్యాహ్న భోజనం పూర్తిచేసికొని మదనపల్లి వెళ్లారు. స్వ. వి.

ముఖ్యంగా స్థానిక సంస్థలు, విద్యార్థులు, విద్యాంసులు అందఱూకూడ ఆదరాభిమానములతో ప్రభుత్వంతో సహకరించి పనిచేయవలెనని, ముఖ్యంగా ఇందులో స్త్రీలు పాల్గొనియీ కార్యక్రమం జరిపించినట్లయితే మరింత చక్కగా సులభముగా జరుగునని మంత్రిగారనిరి. జిల్లాలోని విద్యాకంతుకులు చాలా కృషిచేస్తున్నందువలన యీ ఉద్యమంలో అన్ని జిల్లాలకంటె ఈ జిల్లా ముందంజ వేస్తుందని నుడివిరి.

పిమ్మట జి. కె. స్వామిగారు ఉపన్యసిస్తూ వయోజన విద్యా విషయంలో జిల్లాలో నివసించు జనాభానుబట్టి ఉభయభాషలు మాట్లాడుతూన్న ప్రదేశములలో తెలుగులోను, తమిళంలోను తరగతులు జరిపింపవలెననియు, స్త్రీలకుకూడా ప్రత్యేక తరగతులు జరిపింపవలెననియు సూచించిరి. పిమ్మట స్వామిగారి వందన సమర్పణములతో సభ ముగిసెను.

## చిత్తూరులో వయోజన విద్యా ప్రచారవారం

### ఆహారమంత్రి చే. ప్రారంభోత్సవం

చిత్తూరు, డిసెంబరు 10: నిన్న ఉదయం 8-30 గంటలకు చిత్తూరు బోర్డుహైస్కూలులో వెంకటరమణయ్యర్ గారి అధ్యక్షతక్రింద వయోజనవిద్యాసమితివారి ఆధ్వర్యమున బహిరంగసభ జరుపబడెను. సభకు పురప్రముఖులు అధికారులు చాలమంది హాజరైయుండిరి. పై సమితి ప్రారంభోత్సవమును, ఆహారశాఖామంత్రి ఘోష్ ట్రోరియాగారు జరిపిరి. మంత్రిగారు వయోజన విద్యావిధానమునుగురించి సభికులకు ఎరుకపరుస్తూ, విద్యావిషయంలో హిందూదేశం ప్రపంచంలోని అన్ని దేశాలకన్న వెనుకబడి యున్నదనీ, కాబట్టి మనదేశం అన్నిదేశాలతో సరితూగవలెనన్న విద్యాసంతు లభ్యమకావలెననీ అందుకొరకు వయోజనవిద్య అత్యవసరమనీ నుడివిరి. వయోజన విద్యావిధాన

# వడ్డీలేకుండాఋణాలు

## కడపజిల్లా రైతులకు సౌకర్యం

కడప, డిసెంబరు 7: ఇటీవల వరదల వల్ల చెడిపోయిన భూములను మరమ్మతు చేసుకొనుటకై ప్రత్యేకముగా వడ్డీ లేకుండా రైతులకు ఋణముల నివ్వవచ్చునని ప్రభుత్వమువారు కడపజిల్లా కలెక్టరు గారికి ఉత్తరువు చేసినట్లు తెలుస్తున్నది. ఋణములపైకము బట్వాడాయయిన మొదటి మూడుసంవత్సరములు, ఋణముల వాయిదా చెల్లింపవలసిన పనిలేదు. ఆ తర్వాతనే వాయిదాలు ప్రారంభమగును. ఇప్పటికే అనేకమైన దరఖాస్తులు వచ్చినవని తెలియుచున్నది.

## కో-ఆపరేటివ్ స్టోర్సులో రూ. 4000/- దొంగతనం

విజయనగరం, డిసెంబరు 4: స్థానిక శ్రీకృష్ణా కో-ఆపరేటివ్ స్టోర్సులో నిన్నరాత్రి దొంగలుపడి రూ 4000/- పైగా దొంగిలించారు. ఇనుపపెట్టివున్న గది కిటికీ వూచలు విరగతీసి, ఇనుపపెట్టి బలాత్కారంగా విరగకొట్టి సొమ్ము అపహరించినట్లు తెలుస్తున్నది ఇంకా ఎవర్నీ ఆరెస్టు చేయలేదు. పోలీసువారి దర్యాప్తు జరుగుచున్నది.

# 'చిన్న గ్రామాలలో రెండు సినిమా థియేటర్లుండటం మంచిదికాదు'

## ఈవిషయమై తగిన చర్యకు మద్రాసుప్రభుత్వం ఆలోచిస్తున్నదని గోపాలరెడ్డిగారి వివరణ

తణుకు, డిసెంబరు 10: ఈ పట్టణంలో నల్లజర్ల వీరభద్రరావు, నారాయణరావు సోదరులు నూతనంగా సుమారు 2 లక్షలు వ్యయపరచి నిర్మించిన 'శ్రీ వెంకటేశ్వర టాకీసు'ను మద్రాసు ఆర్థిక మంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు మొన్న ప్రారంభోత్సవం జరిపారు.

మంత్రిగారు ఉదయం తాడేపల్లిగూడెంనుండి అల్లూరి సత్యనారాయణ, మాగంటి బాపినీడు, గొట్టుముక్కల వెంకన్న, కడ్లపట్ల గంగరాజు, నడింపల్లి తిరుపతిరాజు, మాగంటి సీతారామదాసు, పసల సూర్యచంద్రరావు, దంతులూరి నారాయణరాజుగార్లతో కలసి తణుకులోని వెంకటేశ్వర టాకీసుకు వచ్చారు.

మంగళ వాద్యముల మధ్య మంత్రిగారు సినిమాహాలుపై జాతీయ పతాకను ఎగురవైచి, ప్రారంభోత్సవం జరిపారు. అనంతరం అల్లూరి సత్యనారాయణరాజు గారి అధ్యక్షతను బహిరంగ సభ జరిగింది. మాగంటి బాపినీడుగారు ప్రసంగిస్తూ, రష్యాలోను అమెరికాలోను వయోజన విద్యాప్రచారానికి సినిమాల నుపయోగిస్తారనీ, అటువంటి చిత్రాలను హాలు యజమానులు తెప్పించి, ఉచితంగా విద్యార్థులకు ప్రదర్శించి, వయోజన విద్యకు తోడ్పడవలసిందనీ కోరారు. కీ. శే. కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రనిఘంటువును ప్రారంభించి, అ ఆ ఇ ఈ ల వరకు వ్రాశారనీ దానిని పూర్తిచేయుటానికి గోపాలరెడ్డిగారి అధ్యక్షతను ఒక సంఘం ఏర్పాటు చెయ్యబడిందనీ, నిఘంటువును పూర్తి చెయ్యటానికి నిధి అవసరమనీ, ప్రజలనుండి సేకరించిన దానికి రెట్టింపు ప్రభుత్వంయివ్వగలదనీ చెప్పి, దీనికి విరివిగా విరాళాలివ్వవలసిందని కోరారు. దీనికి నల్లజర్ల సోదరులు రు 1116 లు విరాళమిచ్చినందుకు ఎంతయు కొనియాడారు. మాగంటి సీతారామదాసుగారు మాట్లాడుతూ ప్రతిగ్రామానికి ఒక సినిమాహాలుండాలనీ, తద్వారా ప్రజలు చైతన్యవంతులు కాగలరనీ యీ బాధ్యతను ప్రభుత్వమే తీసుకోవాలనీ అన్నారు.

గోపాలరెడ్డిగారు ప్రసంగిస్తూ, సినిమా హాలులద్వారా రాష్ట్ర ప్రభుత్వానికి సాలీనా ఒక కోటి మూడులక్షల రూపాయలు ఆదాయం వస్తున్నదనీ, ప్రతిగ్రామంలోను ఒకహాలు ఉండునట్లు ప్రభుత్వం చూడాలని మాగంటి సీతారామదాసుగారన్నారనీ, యిది సాధ్యంకాదనీ, కాని ఒక హాలుండే చోటే రెండవది కట్టి రెండూ దెబ్బతినే పరిస్థితులు తెచ్చుకొంటున్నారనీ, అందుకని ఒక హాలుండే ఊళ్ళో మరొకహాలుకు లైసెన్సు యివ్వకూడదని ఆలోచిస్తున్నామనీ అన్నారు తర్వాత ఆంధ్రభాషా సంఘానికి వెయ్యిన్నూటపదహార్లిచ్చిన నల్లజర్ల సోదరులను అభినందించారు.

అనంతరం మాగంటి బాపినీడుగారు వెండితెరను ఆవిష్కరించారు రత్నమాల సినిమాలోని కొన్ని భాగాలు ప్రదర్శింపబడెను.

భోజనానంతరం గోపాలరెడ్డిగారు కారులో నిడదవోలు వెళ్లి ప్యాసింజరులో వాల్తేరు వెళ్లారు.

సభానంతరం హాలు యజమానులు బీదలకు సంతర్పణచేశారు. (స్వ. వి.)

## రాష్ట్ర ట్యుటోరియల్ ఉపాధ్యాయుల సభ

గుంటూరు, డిసెంబరు 6: ఆంధ్రరాష్ట్ర ట్యుటోరియల్ ఉపాధ్యాయుల మహాసభ మొన్న గుంటూరు బ్రాడీపేటలోని 'శ్రీ దయా' విద్యాలయంలో జరిగింది. సభకు గుంటూరు హిందూకళాశాల ప్రిన్సిపాలు వల్లభజోస్యుల సుబ్బారావుగారు అధ్యక్షత వహించారు. ఆంధ్రదేశంలోని అనేకప్రదేశములనుండి ప్రతినిధులు సభకువచ్చారు.

ఆహ్వానసంఘాధ్యక్షులు ఆర్. కృష్ణమూర్తిశాస్త్రిగారు సభ్యులకు స్వాగతం చెప్పారు.

అధ్యక్షులు ప్రసంగిస్తూ యీ విద్యాసంస్థలలో పోటీపద్ధతి పోవాలనియు, సమర్థులును తగు యోగ్యతలుకల ఉపాధ్యాయులనే యీ సంస్థలలోకి తీసుకోవలయుననియు అన్నారు.

యూనివర్సిటీ విద్యా విధానంలో మాతృభాషనే ప్రథమభాషగా గుర్తించవలయుననియు, మెట్రిక్యులేషను యస్. యస్. యల్. సి. పరీక్షయందు తీర్ణులైనవారు ప్రైవేటుగా ఇంటర్మీడియేటు బి. ఏ. పరీక్షలకు కూర్చొను అవకాశముండవలయుననియు తీర్మానించారు.

నూతన మెట్రిక్యులేషను ప్రణాళిక విషయంలో, భాషా విషయం కాని విషయాలలో ప్రశ్నపత్రాలు యింగ్లీషులోను తెలుగులోనుకూడ వుండవలెననియు మెట్రిక్యులేషనుపరీక్షలకుకూడ సెప్టెంబర్ పరీక్ష లుండవలయుననియు, తఫాలుతఫాలుగా పరీక్ష పూర్తిచేయు అవకాశముండవలయుననియు, ఇంగ్లీషు పరీక్ష ప్యాసు మార్కు నూటికి నలభైనుండి ముప్ఫైఅయిదుకు తగ్గించవలయుననియు తీర్మానించారు, పరీక్షాధికారులలోను, అకడమికుబోర్డులో ట్యుటోరియలు ఉపాధ్యాయులకు తగు ప్రాతినిధ్య ముండవలయుననియు కూడ తీర్మానించారు.

జి వి. సుబ్బారావుగారు అధ్యక్షులుగను ఆర్. కృష్ణమూర్తిశాస్త్రిగారు కార్యదర్శిగను, యస్. మధుసూదనరావు కె. రాజారావు, యస్. బి. యస్. రామారావు, జి. కె. శర్మ, యు. వసమయ్య గార్లు కార్యనిర్వాహక వర్గసభ్యులుగా ఎన్నుకోబడిరి.

## కోర.కొల్లు కమ్యూనిస్టు కేసులో అరెస్టులు

భీమవరం, డిసెంబరు 6: భీమవరం పోలీసు సబ్ ఇన్స్పెక్టరు సూర్యనారాయణగారు కోరుకొల్లు గ్రామస్థులైన నరసింహరాజు, వెంకట్రామరాజు, అను ఇద్దరిని అరెస్టు చేసిరి. స్థానిక సబ్ మేజస్ట్రేటు వీర్రాజుగారు రిమాండు ఉత్తర్వులు యిచ్చినారు. వీరితో కలిసి మొత్తం 12 గురు ప్రస్తుతం రిమాండులో నున్నారు. గ్రామస్థుల సహాయంతో లోగడ కొందరు కమ్యూనిస్టు బాధితులైన ఉద్దరాజు రామంను పోలీసు వారిని గాయపరిచి విడిపించినందులకు ఈ అరెస్టులు జరిగినవి. ఇంకా పోలీసు దర్యాప్తు జరుగుతున్నది. స్వ. వి.

# అరకటవేముల ఎన్నిక రద్దు

## కడపజిల్లా ఎన్నికల కమిషనర్ ఉత్తరువు

కడప, డిసెంబరు 6: ఈ జిల్లా ఎన్నికల కమిషనర్‌గారైన వి. ఆర్. సత్యనారాయణగారు కడప జిల్లాబోర్డు ఎన్నికల సందర్భములో అరకటవేముల నియోజక స్థానమునకు ఎన్నుకొనబడిన వి. కొండారెడ్డిగారి ఎన్నికను రద్దు పరచుచూ, నూతన ఎన్నికలు జరుపుటకై ఉత్తరువు గావించిరి.

ఎన్నికలలో ఓడిపోయిన అభ్యర్థి జయరామరెడ్డిగారు, కొండారెడ్డిగారి ఎన్నికా సక్రమంలేదనీ, దానిని రద్దుచేసి తానే ఎన్నుకొనబడినటుల ప్రకటించవలెననీ, దరఖాస్తు పెట్టారు.

దీనిమీద ఎన్నికల కమిషనరుగారు విచారణజరిపి, కొండారెడ్డిగారి ఎన్నికను రద్దుచేసి, తిరిగి ఎన్నికలు జరుపవలెనని ఉత్తరువు చేశారు. (స్వ. వి.)

## రేడియో ప్రోగ్రాములు

డిసెంబరు 14 బుధవారం

### మద్రాసు (ఎ)

7 స్వాగతం; 7-30 లక్ష్మీసుందరం: వీణ; 8-15 ఉదయ సంగీతము (రి) 8-30 "బి" వలె; 1-40 సినీమా రికార్డులు; 2-10 (బి) వలె; 2-45 (బి) వలె; 5-30 టి. అన్నపూర్ణాదేవి: సితార్; 6-10 ప్రకటనలు వగైరా; 6-20 తిర్నమ్మ కృష్ణమూర్తి; 7-0 టి. ఎస్. మహాదేవయ్యర్; 7-30 బి. రుక్మిణి: వీణ; 8-0 (బి) వలె; 9-15 కె. ఆర్. గణపతి: వేణువు; 9-45 "బి" వలె; 10-15 రికార్డులు.

### మద్రాసు (బి)

ఉ|| 7 వార్తలు, 7-15 జి. ఎస్. బి. (రి). 7-45 (ఎ) వలె. 8-30 జయలక్ష్మీ జగన్నాథన్. 12 కార్మికులకు. 12-30 మిడిల్‌స్కూళ్ళకు. 1 (ఎ) వలె. 1-50 వార్తలు. 2 గోటువాద్యం నిలయవిద్వాంసుడు 2-15 హైస్కూళ్ళకు. 2-45 కదంబము (రి) 4 ఎలిమెంటరీస్కూళ్లకు. 4-30 (ఎ) వలె 5-30 (ఎ) వలె. 6-20 సాయంసంగీతము (రి). 6-30 గ్రామస్థులకు. 7 వార్తలు. 7-15 గ్రామస్థులకు. 7-45 (ఎ) వలె. 8 మానిసాద నాటిక. 9 (ఎ) వలె. 9-45 ఎన్. గోపాలకృష్ణ వేణువు. 10-15 (ఎ) వలె.

### విజయవాడ

7 వార్తలు; 7-15 రాధ, జయలక్ష్మి (రి); 7-30 ములుకుట్ల సదాశివశాస్త్రి; 8-15 గీతావళి: బందా కనకలింగేశ్వరరావు; 8-30 బి. రామచంద్రరావు: వయొలిన్; 12-30 మిడిల్ స్కూళ్లకు; 1 తారాపథము (రి); 1-40 వాద్యసంగీతము (రి); 1-50 వార్తలు; 2 గానసుధ (రి); 2-15 హైస్కూళ్లకు; 4 ఎలిమెంటరీస్కూళ్లకు; 5-30 బి. రామచంద్రరావు: వయొలిన్; 6-10 ప్రకటనలు మొ||; 6-20 గీతావళి: బందా; 6-30 గ్రామస్థులకు; 7 వార్తలు; 7-15 గ్రామస్థులకు; 7-30 చిత్రవాణి; 7-45 ప్రస్తుత విశేషము-ప్రసంగము; 8 శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి: వీణ; 8-30 ములుకుట్ల సదాశివశాస్త్రి; 9-15 చిత్రవాణి (రి); 9-30 శిష్టు కృష్ణమూర్తిశాస్త్రి: వీణ;

### హైద్రాబాదు

7-30 గురురావు దేశపాండే 8-20 టి. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి 8-50 వార్తలు 9-15 ముమ్మి బాయి 12-38 దోపహార్ కొరాగ్ (రి) 1-0 ప్రేమాంజలి (రి) 1-25 కార్మికులకు ప్రసంగం 1-40 రాగమంజరి (రి) 1-50 వార్తలు 5-0 గురురావు దేశపాండే 5-20 ముమ్మీబాయి 5-35 ఆగాసర్వార్ 6-30 గ్రామస్థులకు 7-0 వార్తలు 7-15 గ్రామస్థులకు 7-55 ఆగాసర్వార్ 8-40 గురురావు దేశపాండే 8-30 ముమ్మీబాయి 8-40 గురురావు దేశపాండే 9-15 ఆగాసర్వార్ 9-25 ముమ్మీబాయి 8-55 శ్రోతల కోరికలు. (రి)

## మదరాసు ధరలు

మదరాసు, డిసెంబరు 12:

బంగారు - వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-కి ఎవ్వర్గు బొమ సేల్సుటాక్సుతోసహా రు. 6 12 పెట్లా బంగారు తులం 115-0-0 మూపబంగారు 118-6-0 సీమవెం తులం 100 కి (రెడి 173-0-0 వెండి తులం 1-కి 1-12 0

వేరుసెనగ: (581 పౌ 1-కి ఎక్సు కోస్టాగిడ్డంగులు) సెలీవ్ (సేల్సుటాక్సుతో సహా) బజారు రు 161-0-0, 162-0-0 (కోరమాండెల్)

వేరుసెనగనూనె ఎక్సుపెల్లర్ (వీసరేలరు 326-0-0 3 టన్ను 5% యఫ్. యఫ్. ఎం. కొంకాయుమాని (87 పౌ ల ఐల్సు) ఒకటికి కొచ్చిన్ క్వాలిటీ. రు 86-8-9, 87-12-9

ఆముదం

కొండి 500 పౌనులుగలది రు. 260, 265 (ఒంగోలు, నరసరావుపేట)రు. 270, 275









Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St. Madras.